ఓం

శ్రీ పాండురంగాయనమః

# శ్రీ పుండరీక చరిత్రము

&

## శ్రీ పాండురంగ నక్షత్రమాల





తెరువరులు! భీమ రథి దరి కరుగఁబోకుఁ
డచటఁగలఁ డొక నీల దిగంబరుండు;
కటితటినిఁ జేతులున్నట్లు గానఁబడియు
ధూర్తుఁడై చిత్తవిత్తంబు దొంగిలించు.

(శ్రీకృష్ణ కర్ణామృతము – ౨ ౩౮)

ర చ యి త

బాపట్ల హనుమంతరావు

శ్రీ సాయీ కుటీరము

చిన్న గంజాము.

మొదటికూర్పు– 1964    1000 ప్రతులు.

పుండరీక ముఖ్య పండరీభక్త ప్ర
భావములును, హరి కృపావిలాస
గతులు, భక్తి భరిత కవితా రసజ్ఞతల్
చాటు నితని కృతి ప్రశస్తిఁ గాంచు!

చీరాల,
19-7-1964.

బందా ఆదినారాయణ.

# శ్రీ పాండురంగాష్టకము.

మహాయోగపీఠే తటే భీమరథ్యా
వరం పుండరీకాయ దాతుం మునీంద్రైః
సమాగత్య తిష్ఠం తమానంద కందం
పరబ్రహ్మ లింగం భజే పాండురగమ్.

తటిద్వాససం నీలమేఘావ భాసం
రమా మందిరం సుందరం చిత్ప్రకాశం,
వరం త్విష్టకాయాం సమ న్యస్తపాదం
పరబ్రహ్మ లింగం భజే పాండురంగమ్.

ప్రమాణం భవాబ్ధే రిదం మామకానాం
నితంబః కరాభ్యాం ధృతోయేన తస్మాత్
విధాతుర్వసత్యై ధృతో నాభికోశః
పరబ్రహ్మ లింగం భజే పాండురంగమ్.

స్ఫురత్కౌస్తు భాలం కృతం కంఠదేశే
శ్రియాజుష్ట కేయూరకం శ్రీనివాసమ్,
శివం శాంతమీడ్యం వరం లోకపాలం
పరబ్రహ్మ లింగం భజే పాండురంగమ్.

శరచ్చంద్రబింబాననం చారుహాసం
లసత్కుండలాక్రాంత గండస్థలాంగమ్
జపా రాగబింబాధరం కంజనేత్రం
పరబ్రహ్మ లింగం భజే పాండురంగమ్.

కిరీటోజ్జ్వల త్సర్వ దిక్ప్రాంత భాగం
సురైరర్చితం దివ్యరత్నై రనర్ఘ్యైః
త్రిభంగాకృతిం బర్హమాల్యావతంసం
పరబ్రహ్మ లింగం భజే పాండురంగమ్.

విభుం వేణునాదం చరంతం దురంతం
స్వయంలీలయా గోపవేషం దధానమ్
గవాంబృంద కానందదం చారుహాసం
పరబ్రహ్మ లింగం భజే పాండురంగమ్.

అజం రుక్మిణీప్రాణ సంజీవనంతం
పరంధామ కైవల్య మేకం తురీయమ్
ప్రసన్నం ప్రపన్నార్తిహం దేవదేవం
పరబ్రహ్మ లింగం భజే పాండురంగమ్.

స్తవం పాండురంగస్య వైపుణ్యదంయే
పఠంత్యేక చిత్తేన భక్త్యాచ నిత్యమ్
భవాంభోనిధిం తేఽపి తీర్త్వాంతకాలే
హరేరాలయం శాశ్వతం ప్రాప్నువంతి.

ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచితం
శ్రీ పాండురంగాష్టకమ్ సంపూర్ణమ్.

ఓమ్

నమః శ్రీకృష్ణాయ భగవతే.

శ్రీ సాయీ సద్గురవే నమః

# విజ్ఞప్తి

సోదరీ సోదరభక్తులారా!

"సంసార విషవృక్షస్య ద్వేఫలేహ్యమృతోపమే
కదా చిత్కేశవే భక్తిః తద్భక్తైర్వా సమాగమమ్"

ఈ సంసారమను విషవృక్షమున అమృతతుల్యములగు రెండు ఫలములుమాత్రము కలవు. ఎప్పుడేని శ్రీకృష్ణునియందు భక్తి నెలకొనియుండుట మొదటిఫలము. శ్రీహరిభక్తుల సాంగత్యము రెండవ ఫలము. జీవికి రెండుఫలములు లభించుట జన్మాంతర సుకృతవిశేషము. జీవి దైవాభిముఖుఁడై సార్థకజన్ముఁ డగుటకు, సాధుసాంగత్యమును సంపాదించుకొనఁదగును.

"ముఖ్యతస్తు మహత్కృపయైవ, భగవత్కృపాలేశాద్వా"
పరమసాధు మహాత్ముల కరుణయేని,
హరికృపా లేశమేని ముఖ్యమగు దీన.

"మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ"
ఆ మహాత్ముల సాంగత్యమనిన
దుర్లభం బగమ్యమమోఘమై పఱగుచుండు.

"లభ్యతేఽపి తత్కృపయైవ"
ప్రాప్తమగుటయు నా పరాత్పరుని కృపయ.

"తస్మింస్తజ్జనే భేదాఽభావాత్"
స్వామికిఁ దదీయునకు భేదమేమి లేమిః.

"తదేవ సాధ్యతాం - తదేవ సాధ్యతామ్"
ఇదియ సాధింపు డిదియ సాధింపుఁడెపుడు.

నారదభక్తిసూత్రములు (ప్రేమామృతము) (38-42)

జీవి మానవదేహమొంది యీ భూ మి పై జనించిననాటనుండి యాతని పరిసరములు, నాబాల్య మతనికిఁగలుగు సాంగత్యాదు లాతనిని మంచికిఁగాని, చెడ్డకుఁగాని తీర్చిదిద్దుచుండును. బాల్యమునఁ బాదుకొనిన యభ్యాసాదు లాతని నామరణాంతము విడువవు. జీవయాత్రయందతనికిఁ గలుగు సాంగత్యాదు లాయా యలవాటుల రేకెత్తించుచుండును. కావున మానవుఁ డుజ్జీవనమొ ది, జన్మసఫలతఁగనుటకు, భ్రష్టుఁడై నశించుటకు సాంగత్యమే ముఖ్యకారణమగును.

నా 20-22 యేండ్ల మధ్యకాలమున ఆదిపాండురంగ భక్తవిజయ మును చదువుభాగ్యము లభించినది. ఆ భక్తవిజయమంతయుఁ బద్యకావ్య ముగ వ్రాయఁదలంచి 1926 జులై నాటికి శ్రీ పుండరీకచరిత్రముఁ బూర్తిఁగావించితిని. అంతటితో నా ప్రయత్నమాగి శ్రీమద్భగవద్గీతా మృతాది గ్రంథరచనలపై దృష్టిమరలినది.

1944 సంవత్సరమునుండి శ్రీ సాయీమహాప్రభువు ఆశ్రయము లభించినవిధము, నదిమొదలు బాబా పలికించిన కృతులనుగూర్చి లోఁగడ వెలువడిన శ్రీ సాయీలీలా ప్రచురణములందు వివరింపఁబడినది. ఆప్రచు రణములందు ముద్రణముకావలసినగ్రంథములలో 'శ్రీపుండరీకచరిత్రము' ను జేర్చియుంటిని. ఆ గ్రంథములను జదివిన సోదరభక్తులు, సుదారులు, సుహృదులగు శ్రీ జి. వి. కృష్ణయ్యగారు 1962 న 'శ్రీ ఆపదుద్ధారక శతకము' పునర్ముద్రణభాగ్యముఁ గల్పించి, శ్రీ పుండరీకచరిత్రము' ముద్రణమైనదా?- ఆయిన నొకప్రతిపంపుఁడనికోరినారు. ఆకృతి 1926 న రచింపఁబడినదనియు నింకనుము ద్రణముకాలేదని వారికిఁదెలిపియుంటిని. వారంతటనూరుకొనక, మరల 1963 న శ్రీ పుండరీకచరిత్రము విషయమై ప్రస్తావించి, 'వ్రాతప్రతినైన పంపినఁ జదివి తిరిగిపంపుదును.' అని యుత్తరమువ్రాసిరి. వీరీకృతివిషయమై యింతయభిమానము వహించుట కుఁగల కారణమేమైయుండునా? యనితలంచి, వారికి మాతాపితలయందుఁ గల భక్తివిశేషమైనాకావలయును, లేదా - ఆబాల్యము హృదయకమలమున నధివసించి, యంటియున్న శ్రీకృష్ణుఁడే తనకృతిని వెలువరించి, నాచిన్న

నాటి సంకల్ప మేదొకవిధమున ఫలింపఁజేయఁ దలంచి, యీ యాప్త మిత్రుని ప్రేరేపుచుండవలయునని యూహించి యీ చిన్నికృతికిఁ బ్రతి వ్రాసిపంపితిని. జననీజనక పదభక్తివిశిష్టమును, శ్రీకృష్ణభక్తి విరాజిత మగు వంశమునజనించిన శ్రీ జి. వి. కృష్ణయ్యగారాకృతినిఁ జదివికొని దానినిఁ దిరిగిపంపుచు తమ అగ్రజుఁడగు శ్రీ వేంకటకృష్ణయ్యశ్రేష్ఠి గారి గ్రంథముద్రణమునకు ద్రవ్యసహాయముఁ జేయుదురని వ్రాసినారు.

శ్రీ పాండురంగని యనుగ్రహమునకు సంతసించి, నా చిన్ననాటి సంకల్పమును–'భక్తవిజయము' లోని భక్తులచరిత్రములను పద్య కావ్యముగ వ్రాయవలయునను సంకల్పమును-ఏదొకవిధముగ సఫల మొందించుకొనుట కందలి భక్తులను గీర్తించుచు 'శ్రీ పాండురంగ నక్షత్రమాల' అను పేర 27 సీసపద్యముల నీకృతియందుఁ జేర్పఁ దలంచి, [illegible] సమ్మతిఁ దెలుపుఁడని కోరియుంటిని. ప్రేమరసపరిపూరిత హృదయులగు శ్రీ వేంకటకృష్ణయ్యగారు "మీరేమి సందేహింపక చేర్పఁదలఁచినవన్నియుఁ జేర్పుడు" అని సమాధానమిచ్చిరి. ఈ కృతి ముద్రణమునకు ద్రవ్యసహాయముఁజేసిన యుదారులు వదాన్యులగు శ్రీ వేంకటకృష్ణయ్యగారియెడ వారి కుటుంబమునెడ గల కృతజ్ఞతను మఱియొకతావునఁ దెలుపుకొంటిని.

## శ్రీ పుండరీకచరిత్రము — ముఖ్యాంశములు

ఈకథ "పద్మపురాణము" లోనిది. భరతఖండమున భూలోక వైకుంఠమనఁదగిన పండరిక్షేత్రమునందు లక్ష్మీసమేతుఁడై శ్రీమన్నారాయణుఁడు శ్రీ పాండురంగావతారమూని, నిత్యవాసముసేయుటకుఁ గారణ మేమని పార్వతీదేవి, పరమేశ్వరునిఁ బ్రశ్నింపఁగ, మెచ్చి, శంకరుఁడు గౌరికిఁదెలిపిన వృత్తాంతమును సకల పురాణేతిహాసవిదుఁడగు సూతుఁడు శౌనకాదుల కెఱింగించినట్లు పేర్కొనఁబడినది. "శ్రీ రఖుమాబాయి పాండురంగవిఠల" యవతారమునకు సంబంధించిన యీకథను చిన్న పద్యకావ్యముగ రచించి సోదరభక్తులకందించికొను భాగ్యమును శ్రీకృష్ణ భగవానుఁడు ప్రసాదించినాఁడు. ఇందుఁ బరమభాగవతులఁ గీర్తించుచు

శ్రీ పాండురంగనక్షత్రమాలను జేర్చి ధన్యుఁడనైతిని. శ్రీ పాండురంగాష్టకము, శ్రీ పాండురంగాష్టోత్తర శతనామావళి, మంగళాశాసనము సోదర భక్తులు స్మరించి యానందింతురని చేర్చితిని. 'తస్మిన్తజ్జనేభేదాఽభావాత్' 'స్వామికి, తదీయులకు భేదమేమిలేమి' భాగవత స్మరణమే భగవానునిస్మరణముకావున శ్రీ పాండురంగ నక్షత్రమాలను సోదరభక్తులు స్మరింతురుగాక!

శ్రీ పుండరీకచరిత్రమునందుఁ బ్రధానాంశము పాఠక శ్రోతలు గ్రహింపఁదగినది "మాతా–పితృభక్తి" మనము వేదములను సావధానముగఁ బరిశీలించి, పూర్వ శిష్టాచారములను సుదీర్ఘముగఁ బరిశోధించినమానవసంఘమునందు వేఱేదైవము, దేవతలు, లేరనియే తెలియును. సర్వవ్యాపి, సర్వనియంత, సర్వకర్త, సర్వభర్త వాఙ్మనముల కతీతుఁడగు దైవమంతట వ్యాపించియున్నాఁడు.– అని, వేదము లుద్ఘోషించుచున్నవి. నాగరకతా ప్రపంచమున మానవునకుఁ బ్రత్యక్షదైవము - యుగళరూపముననున్న 'మాతాపితలు', అని వేదములు ప్రవచించుచున్నవి. తండ్రి తాతలే మానవున కాదర్శపురుషులు - అనుసరణీయులు.

''యేనాస్య పితరోయాతా - యేనయాతా పితామహాః
తేన యా యాత్సతాంమార్గం - తేనగచ్ఛ న్నరిష్యతే"

సాధు సత్పురుషులగు తమతమ తండ్రులు-తాత లేమార్గముననుసరించిరో యా మార్గమే మానవునకుశ్రేయస్కరము. అట్టివారిననుసరించినవారెన్నఁడును జెడరు.

"ఉపాధ్యాయాన్ దశాచార్య అచార్యాణాం శతంపితా
సహస్రంతు పిత్రూన్ మాతా గౌరవేణాతిరిచ్యతే''

ఉత్తమవిద్యగఱపిన యుపాధ్యాయునెడఁ బఱపు గౌరవమునకు పదిరెట్లుగ గాయత్రీ మంత్రోపదేష్టయగు నాచార్యుని గౌరవింపదగును. అట్టి ఆచార్యునికంటె శతాధికముగ తండ్రిని గౌరవించఁదగును. తండ్రి కంటె వేయిమడుంగులఁ దల్లిని గౌరవించి పూజింపఁదగును.

మానవునకుఁ దల్లిదండ్రులే ప్రత్యక్షదైవమని వేదములువివరించు చున్నవి. అందుఁ దండ్రికంటెఁ దల్లి ప్రధానముగఁగీర్తింపఁబడుచున్నది. "న మాతుః పరదైవతమ్"– తల్లికంటె శ్రేష్ఠమైన దైవములేదు. "మాతృదేవోభవ!– పితృదేవోభవ!" యని శ్రుతులు శాసించుచున్నవి. "భూప్రదక్షిణ షట్కేన తత్ఫలం మాతృవందనే"– ఆరుమాఱులు భూప్రదక్షిణముఁ జేయుటవలనఁగలుగు ఫలము ఒక్కమాఱు తల్లికి నమస్కరించినఁ బడయనగును. కోటియజ్ఞములుచేసిన, సకల పుణ్యతీర్థ ములందుఁగ్రుంకిన, భూప్రదక్షిణలుచేసిన, కాశీక్షేత్రమును రెండులక్షల మాఱులు ప్రదక్షిణించిన పొందుఫలము మాతృపదవందనముతో సరిగా వనియుఁ, దండ్రికొక్కమాఱు నమస్కరించిన ఉత్తమ జ్ఞానముగలుగు ననియు, శాస్త్రపురాణములు తెలుపుచున్నవి. భూమికంటె విశాలమైన స్థానము తల్లియనియు, ఆకాశమునకంటె నున్నతమైనస్థానము తండ్రి యనియు శాస్త్రవేత్తలు పలుకుదురు. అట్టి మాతాపితృభక్తిగలిగి, సేవించు బిడ్డలనుజూచి, శ్రీమన్నారాయణుఁడు సంతసించును. ప్రత్యక్షమై సకలా భీష్టములను బ్రసాదించును.

## ప్రేమ—దైవము

"దైవమే, ప్రేమ; ప్రేమయే దైవము" దైవమును నిర్వచింప వలయుననిన 'ప్రేమ' అను రెండక్షరములకంటె వేఱు వివరణములేదు. ఆ ప్రేమయే యీ విశ్వమును సృజించి, పోషించి, తుదకుఁ దనలోనికి నుపసంహృతిఁ గావించుకొనుచున్నది. అది యీ విశ్వమున "మాతా పితృ" రూపము ధరించినది. నవమాసములుమోసి, వివిధబాధల సైచి కని, పెంచినబిడ్డపైఁ దల్లికిఁగలప్రేమను వివరించుటకుఁ బదములుతేవు. తండ్రియు బిడ్డకై పడు పాటులు లెక్కలేనివి. తల్లిదండ్రులు బిడ్డకైపడు శ్రమలకుఁ గారణము 'ప్రేమ' యే. తమకుఁగల సర్వస్వమును బిడ్డకై ధారవోయుదురు. అట్టి ప్రేమస్వరూపులయెడఁ బ్రేమనెఱపుట బిడ్డవిధియై యున్నది. దేనికేనియు నిష్కృతి కలదు, గాని, కృతఘ్నతకు లేదు.

జా ఘటప్రీతన ప్రేమరస - పునిరసనానహి రామ్
తే నర పశు సంసారమే - ఉపజిమరే బేకామ్.

"ప్రేమపాత్రమె వాని హృదయంబు కాదొ!
రామనామంబెని రసనాన నిలదొ!
అట్టి నిరర్థకుండైన నరుండు
పుట్టుచు నవనిపైఁ బొలియుచునుండు"

(శ్రీ సాయీ కబీరుసూక్తులు)

ఏజీవియేనియు మనుష్యుఁడై జనించిన తరువాత కర్తృ కళేబర దాతలగు జననీజనకులఁ బ్రేమించుట, విహితోపచారములఁ గావించుట. వారికి సుఖసంతోషములఁ గూర్పుటకంటె నతఁడు చేయఁదగిన విశేష కర్మములుగాని, యజ్ఞాదులుగాని లేవు.

"విచిత్రా దేహసంపత్తి రీశ్వరాయ నివేదితుం
పూర్వమేవా కృతాబ్రహ్మన్ హస్తపాదాది సంయుతమ్!"

విచిత్రములగు కర్మేంద్రియ జ్ఞానేంద్రియములతోఁ గూడిన యీ దేహసంపదను బ్రహ్మస్వరూపులగు మాతాపితలు మనకుఁ బ్రసాదించి యున్నారు. అట్టి యీ దేహసంపదను దైవస్వరూపులగు నా జననీ జనకులకే ముఖ్యముగ వినియోగింపదగినది.

మానవసంఘము క్రమబద్ధమై, సర్వతోముఖముగఁ బె.పొంద వలయుననిన 'ప్రేమ' నే ముఖ్యాధారముఁ గావించుకొనఁదగును. ఈ ప్రేమతత్త్వమున గ్రహింపఁదగిన పాఠశాలగృహమే. పుట్టినదాదిగ బిడ్డయెడ జననీజనకులు ప్రదర్శించు ప్రేమను, బుద్ధితెలిసినతరువాతనే కానిండు-బిడ్డ గ్రహించి, యా ప్రేమలో శతాంశము- లేక సహస్రాంశ మేని తిరిగి యా తల్లిదండ్రులయెడఁ బ్రవర్తింపలేనివాఁడు 'మనుష్యుఁ' డని చెప్పఁగొనఁదగినవాఁడు, అట్టి మహోపకారులయందు దైవదృష్టి

వహించి, ప్రేమింపలేనివాఁడు, ఇరుగుపొరుగువారలను బంధుమిత్రులను, గ్రామములోనిజనులను, దేశీయులను, విశ్వమానవులను, సకలభూతములను ఎట్లు ప్రేమింపఁగలఁడు? తానెల్లరఁ బ్రేమించుచున్నట్లు తలంచుట, చెప్పుకొనుటయందేదో స్వార్థప్రయోజనాసక్తి దాగియున్నదనియే మనము తలంచవలయును. చేతనాచేతనాంతర్గతమగు దైవమును నిజ జననీ జనకులందుఁ జూచి ప్రేమింపలేని నరుఁడు సకలభూతముల నీశ్వరదృష్టితో నెట్లు చూచి ప్రేమింపఁగలఁడు?

ఈ ప్రపంచమునఁ దల్లిదండ్రులకంటె మానవునకు మహోపకారులు లేరు. ప్రేమమయులులేరు. అట్టి ప్రేమస్వరూపులను - ప్రత్యక్ష దైవములను ప్రేమింపలేనిసుతుఁడు వ్యర్థుఁడు-పశుప్రాయుఁడుననకతప్పదు. పరమపూజ్యులగు జననీజనకులయెడఁ బ్రేమఁబూనకయే తానీసకలమును బ్రేమించుచున్నాఁడ నని యేమేమియో పదరువాఁడు లోకవంచకుఁడు. అట్టివాఁడు తన్నుదా వంచించుకొని యితరులను వంచించువాఁడు. దుర్మార్గులగు తల్లిదండ్రులయెడనేని ఉపేక్షాభావము వహింపనగును గాని ద్వేషము తగదు. హింసించుటతగదు. సకలమును ఈశ్వరమయమని చెప్పఁబడుచుండ నింక ద్వేషవస్తువేమికలదు?

శ్రీ పుండరీకచరిత్రమునందు - పుండరీకుఁడు సద్బ్రాహ్మణవంశమున జనించి, సకలవిద్యల గడించియు, దుష్టసాంగత్యమున నెట్లు భ్రష్టుఁడై, జననీజనకుల హింసించి, తుదకు సాధుసత్పురుషుఁడు, మాతాపితృభక్తిపరిష్ఠుఁడగు కుక్కుటమహాముని దర్శనభాగ్యమున విగతకల్మషుఁడై, గంగా యమునా సరస్వతీ నదీమతల్లుల సందర్శనభాగ్యమువడసి, గంగాదేవివలన సుశిక్షితుఁడై, మంచిబుద్ధిగలిగి, పూర్వజన్మ సుకృతవిశేషమున సాధుమార్గావలంబియై, మాతాపితృ శుశ్రూషాపరాయణుఁడై, తుదకు శ్రీమన్నారాయణుని సాక్షాత్కారమువడసి, యీ పండరిక్షేత్రమున శ్రీ రఖుమాబాయి పాండురంగవిఠల రూపముల శ్రీ లక్ష్మీనారాయణు లధివసించి, భక్తజనుల నెల్లల ననుగ్రహించునట్లు వరమువడసి చిరకీర్తి నార్జించినాఁడు.

దైవము నెఱుంగఁదలఁచువాఁడు – సాధకుఁడు ప్రేమతత్త్వము గ్రహించి, యారాధించవలయును. ఎవనిహృదయమున నొకించుకేనిఁ బ్రేమరసముగలదో యచట దైవ మధివసించి యున్నాఁడని మనము గ్రహించనగును. వాఁడే - భాగవతుఁడు. తదీయుఁడు భక్తుఁడు. దైవము నుపాసించుటయనఁగా ప్రేమ నుపాసించుటయే. ఎవనిహృదయ మెంతెంత విశాలమై దినదినప్రవర్ధమానమై విశ్వమందెంతెంతమేర కా ప్రేమజ్యోతి ప్రసరించుచుండునో వాఁడు దైవమున కంతంత సన్నిహితుఁడై దైవాను భూతినిఁ బొందువాఁడుగ మనముగుర్తించనగును. భక్తుఁడగువాని కేకైక చిహ్నము – ప్రేమ యొక్కటియే. తక్కిన బాహ్యచిహ్నములతో నిమిత్తములేదు. కావున సోదరీ సోదరభక్తులెల్ల యాప్రేమనే గుర్తింపుఁడు- ఆ ప్రేమనే ఉపాసింపుఁడు. ప్రేమమయులరగుఁడు. మానవున కుపాయో పేయములు. జీవితఫలము. 'ప్రేమ' యే. ఈ విశ్వమున మానవుఁడీయఁ దగినది–పొందఁదగినది, ప్రేమయే - అదియే 'దైవము'.

## నేత్రదాతయెడ కృతజ్ఞత

1962 సంవత్సరమున - అనఁగా నా 61 వ యేట నేత్రవ్యాధివలనఁ జదువుటకు వ్రాయుటకు సాధ్యముగాకుండెను. ఆసందర్భమున శ్రీ సాయీ నాథుఁడు, సోదరభక్తుఁడగు శ్రీ కె. కో టే శ్వ ర రా వు నా యు డు (Proprietor, messrs. Krovi Bros., Opticians. Guntur.) గారి రూపమునఁ దోడ్పడి నేత్రచికిత్సాదులకు ధనసహాయముఁ జేయుటయే కాక, మంచి కంటిజోడును బహూకరించినారు. శ్రీ సాయీనాథుని కృతి రూపమగు సేవచేయుటకుఁ దిరిగి యవకాశముఁగల్పించి తోడ్పడుచున్న ప్రేమౌదార్య స్వరూపుఁడగు చి॥ శ్రీ కె. కోటేశ్వరరావు నాయుడుగారియెడ నా కృతజ్ఞతను బ్రకటించుకొనుచు, శ్రీ సాయీనాథుఁడు వారిని వారికుటుం బమును సర్వదా సర్వవిధముల ననుగ్రహించుగాతమని ప్రార్థించువాఁడను.

## ఈ కృతి ముద్రణద్రవ్యదాతయెడఁ గృతజ్ఞత

'పలుకన్‌వచ్చుఁబ్రియోక్తులెన్నయిన-ద్రవ్యత్యాగముల్ మాటలా?'

అని, 'శ్రీ సాయీమననము' విజ్ఞప్తియందుఁ దెలిపియుంటిని. దైవీసంపద లందువిశిష్టమైనది-త్యాగబుద్ధి "శ్రీ ఆపదుద్ధారకశతకము" పునర్ముద్రణమునకు ద్రవ్యసహాయముఁ జేసిన శ్రీ జి. వి. కృష్ణయ్య B. A., (Extension Officer, Co- op. Udayagiri Block. Udayagiri) గారియెడ గృతజ్ఞత నా కృతియందుఁ దెలిపియుంటిని. వీరియన్నగారు శ్రీ జి. వెంకటశేషయ్య శ్రేష్ఠిగారు, (President, Panchayat Board, Vengampalli) ఈ గ్రంథముద్రణమునకు ద్రవ్యసహాయము చేసిన మహోదారులు. ఈ యిరువురు సోదరులు భక్తులు నుదారులు వదాన్యులుఁ బరోపకార పరాయణులు గల యుత్తమవంశమున జనించిన వారు. ఈ సోదర ద్వయమునకుఁ గల మాతాపితృ సేవనాసక్తియు, శ్రీ పాండురంగ పదాబ్జభక్తియే వీరికీ కృతినిఁ బ్రచురింప వలయునను ఆసక్తినిఁ గలిగించినది. ఇది వీరిజన్మాంతర సుకృతవిశేషము. అవ్యాజ కరుణాసింధువగు శ్రీ పాండురంగ సాయీలీల! ఇట్టి మహోదారులగు భక్తులనుగన్న వీరి వంశీయులయెడ నా కృతజ్ఞతఁ దెలుపుకొనుచు చి॥ శ్రీ జి. వేంకటశేషయ్యశ్రేష్ఠిగారిని, వారియనుఁగుఁదమ్ముఁడు చి॥ శ్రీ వేంకటకృష్ణయ్యగారిని వీరిరువుర కుటుంబములను శ్రీ పాండురంగ సాయీప్రభువు సర్వదా సర్వథా రక్షించుగాత! మని ప్రార్థించువాఁడను.

ఈకృతిని సోదరభక్తులు పఠించి, మాతాపితృ సేవనాపరులు, శ్రీ పాండురంగ పదకమలరతులునై శ్రీ విఠోబా సాయీయనుగ్రహమున సుఖసంతుష్టి సంతృప్తిశాంతులను బడయుదురుగాత!మనిప్రార్థించువాఁడను.

శ్రీ సాయీప్రసన్న! శ్రీ సాయీసమర్థ!

శ్రీ సాయీకుటీరము, ఇట్లు విన్నవించు,
చిన్నగంజాము, శ్రీ సాయీభక్తచరణ పరిచరణుఁడు,
20-7-1964. బాపట్ల హనుమంతరావు.

# ప్రశంస - ఆశీస్సులు

శ్రీ యశోన్నతిఁ నెల్లూరు సీమ యందు
కవట గోత్రంబునఁ వణిగ్వరుఁడు రాజ
మాన్యుఁడై, హయ బహుమానమొంద,
వంగడముపాల్చె "గుఱ్ఱమువా" రనంగ.

పొనర నా సీమ రాపూ రుపమండలం
బున నెలకొను వెట్టిభొట్లపల్లె
వాసియై, గుణ గణోద్భాసియై వంశ ప్ర
సిద్ధినొందిన "పాపిశెట్టి", పుత్ర
షట్కంబుఁగాంచెను చలమయ్య, లక్ష్మయ్య
లను, మఱి నలువుర వినుతయశుల,
పఱగ "వెంగంపల్లె" "బచ్చు" వారలకు చ
లమయ లక్ష్మయలు నిల్లటముసనిరి,

మేటియై "రజానగరము పేటఁ" జేరి,
వర్తకముసల్పి బహువిధైశ్వర్యములను
పార్జనముసేసె సుబ్బమాంబా ధవుండు
కృష్ణభక్తుండు, చలమయ్యశ్రేష్ఠివరుఁడు.

సవిధానంబుగఁ గృష్ణవిగ్రహప్రతిష్ఠఁ సల్పెఁ గోదండరా
ఘవ దేవస్థలి నా రజానగరిఁ; గైంకర్యార్థఁ బల్యంకికో
త్సవఁ - మే లేటటను గోకులాష్టమి సమర్చల్ గూర్చుచుఁ సుస్థిరం
బవు న్నేర్పాటులఁజేసి భక్తిఁ జలమయ్యశ్రేష్ఠి వాసిఁగనెఁ.

ఔరసులు కల్గకుండిన కారణమునఁ
దమ్ముఁడౌ లక్ష్మయశ్రేష్ఠి తనయుఁ డందు,
జ్యేష్ఠు, నరసింహులను గత్తుఁజేసికొనియె.
చలమయశ్రేష్ఠి - వంశ విస్తరణదృష్టి.

జనకుల తొంటి వాసమును వెంగంపల్లెఁ
జేరిన శ్రీనరసింహశ్రేష్ఠి
సుదతీమతల్లియౌ సుబ్బలక్ష్మమ్మను
జేపట్టి కాంచె నా చెలువయందు,
వేంకటశేషయ్య - వేంకటకృష్ణయ్య
లను సుతులను, సుత లైదుగురను;
ఋణమీఁగ నలుగురు తనయులుచనిరి బా
ల్యమునంద; సుత-మహాలక్ష్మి దక్క,

నా యువిదయును రేపూడి- వాయుగుండ్ల
చెంచయశ్రేష్ఠివర్యునిఁ జెట్టవట్టి,
తనయ వరలక్ష్మమాంబను గనినపిదప,
ఋణ విముక్తినిఁగాంచి, శ్రీకృష్ణుఁజేరె.

పకాల్ కకలులేక వెంగమపల్లె పంచాయతీసంస్థ క
ధ్యక్షుండై తగ నిర్వాదేండ్లు నరసింహశ్రేష్ఠి తత్తద్విధుల్
దక్షత్వంబున నిర్వహించి, జనవాత్సల్యంబుఁ జూఱఁగొనె
సాక్షాద్ధర్మ మితండ సుమ్మనుచు సంశ్లాఘింపఁ బ్రాంతప్రజల్.

అనుగుంబౌత్త్రులఁజూచు పూర్వమ నృసింహశ్రేష్ఠి శ్రీకృష్ణుఁ జే
రెను, ప్రేమాస్పద సుబ్బలక్ష్మి తనకోర్కెన్దీర్చు వంశాంకురం
బును గాంచంగల భాగ్యమబ్బెనను సమ్మోదంబునన్ గన్నుమూ
సెను తేనవ్వులుచిందులాడ ముఖరాజీవంబునందెంతయున్.

వీరమాంబాసతిన్ వేంకటశేషయ్య
చేపట్టి వన్నె వాసినిగడించి,
జనకు ననంతరంబునను వెంగంపల్లె
పంచాయతీసంస్థ భారమూన,
వెస, పట్టభద్రుఁడౌ వేంకటకృష్ణయ్య
సహధర్మచారిణి సత్యవతిఁగ
సహకార పరపతి శాఖాధికారియై
కార్యనిర్వహణ దక్షతలఁ దనరి,
శ్రీశుకరుణ వేంకటనరసింహరావు,
సదృశగుణ రూపు వేంకటసాయి విజయ
భాస్కరున్, బ్రియతనయ సౌభాగ్యలక్ష్మిఁ
బడసి, గురుభక్తి వినయ సంపదలఁ బొదలు.

రామ లక్ష్మణులన, బలరామకృష్ణు
లనఁగ - నన్నయుఁ దమ్ముఁడుఁ దనరుచుండ్రు;
చిరము వేంకటశేషయ్యశ్రేష్ఠి యాజ్ఞఁ
బ్రేమఁ దలఁదాల్చు వేంకటకృష్ణుఁడౌర!

## ఈ కృతి ముద్రణ ద్రవ్య దాతలు



శ్రీ జి. వెంకటశేషయ్య శ్రేష్ఠిగారు
ప్రసిడెంటు-పంచాయితీబోర్డు
వెంగంపల్లి, ఆత్మకూరు తాలూకా
నెల్లూరు జిల్లా.

వారి సతీమణి
శ్రీమతి. వీరమాంబ గారు

అనుజు బిడ్డలే తనబిడ్డలనుచుఁ దలఁచుఁ
బ్రేమ వేంకటశేషయ్యశ్రేష్ఠి సతము,
తనువులవి రెండుగాని, స్వాంతంబదొకటె;
అది పురాకృత సుకృత భాగ్యమనఁదగదె!

ధృతి, మాతాపితృభక్తి తత్పరతలన్ శ్రీకృష్ణపాదార్చ నా
రతి, వంశానుగతప్రసిద్ధ ఋజుధర్మప్రక్రియా ధీ వదా
న్యతలన్ సోదరులిర్వు రొండొరులసాహ్యైయుందు, రేతత్పురా
కృత సత్పుణ్యవిశేషమున్ దలఁచి యగ్గింపంగబంధుల్ హితుల్.

ఉభయకుటుంబ సంయుతుఁడునై పుణ్యతీ
ర్థంబులఁ బెక్కు క్షేత్రములఁజేరి,
పితరుల ఋణమీఁగ వివిధ ధర్మక్రియా
విధులనుఁదీర్చి, సంతృప్తిఁగాంచి,
యట, విఠలుని, శయనైకాదశీతిథిఁ
బండరిఁజేరి సద్భక్తకోటిఁ
గని, కొల్చి, చంద్రభాగను దోఁగి నీదుసం
సేవా మహత్త్వ మార్జింపఁగనిన,

యనఘు, వేంకటశేషాఖ్యు, నతనితమ్ము,
నాయురారోగ్యవిభవ వంశాభివృద్ధి
సంపదలఁగూర్చి, సతతంబు సాకఁగదవె!
భక్తహృదయాబ్జ భృంగ! శ్రీపాండురంగ!

శ్రేయోఽభిలాషి,
రచయిత.



వంశీ విభూషితకరా న్నవనీర దాభాత్
పీతాంబరా దరుణబింబ ఫలాఽ ధరోష్ఠాత్
పూర్ణేందు సుందర ముఖా దరవింద నేత్రాత్
కృష్ణాత్పరం కిమపి తత్త్వమహం నజానే.

(మధుసూదన సరస్వతి)

ఓమ్

నమః శ్రీకృష్ణాయ భగవతే.

శ్రీ సాయీ సద్గురవే నమః.

# ప్రార్థన

శ్రీరుచిరాంగి రాధిక చరించుచు దవ్వులఁ బ్రేమదృక్కులిం
పార నిగుడ్చ, మేను గరుపాఱుచుఁ జేలము వ్రేలఁ, బింఛముల్
జారఁగఁ జేతివేణు వొకచక్కఁ బడన్ బ్రియుకై కళిందజా
తీరవనంబులం దినుకతిన్నెలఁబర్విడు కృష్ణుఁ గొల్చెదన్.

బృందారణ్యమునందు గోపతరుణీ బృందంబులన్గూడి యా
నందాంభోనిధిఁదేల్చు కృష్ణు మురళీనాదంబు దా వీనులన్
విందై తోఁపఁగఁ బారవశ్యమున గోవిందున్ సమీపించు మా
బృందాదేవిని రాధికాంబికను సేవింతున్ మదిష్టాప్తికిన్.

అందనుజేరి, మ్రొక్కిడు నాశ్రితమండలికెల్ల నూఁతయై,
దండధరోగ్రపాశములఁ దార్కొననీయక, దాసదాసుఁడై
యుండి, యెవారలేన్ బిలువ, ''నో''-యని, వేగమ డాయు రుక్మిణీ
పండరినాథ దివ్యపదపద్మములన్ భజియింతు నిచ్చలున్.

భూతములన్ విధాతయనఁ బుట్టువునొందఁగఁజేసి, వాని సం
ప్రీతి జనార్దనుండగుచు వృద్ధినిఁబొందఁగ రక్షచేసి, క్రో
ధాతిశయంబునన్ హరుఁడునై సకలంబు లయంబుఁజేయు, నే
నేత,-యతండు పొల్చు వరణీయుఁడునై భువనాళి నెల్లెడన్.

ఒక్కొకదేశమందున నొకొక్కవిధాన నొకొక్కభాష నొ
క్కొక్క మతప్రవక్త హితసూక్తుల భక్తులువేడ నీశుఁడా
షక్కని వారి వారికి నపారకృపామతి నిందునందుఁ డాఁ
జక్కనొసంగు భక్తిసదృశంబుగ నాశ్రితవాంఛితార్థముల్.

ఎవరేపేరునుపెట్టి పిల్చినను డా నీశుండు సర్వాత్మకుం
డవుఁగానన్ నిజభక్తవాంఛఁగని, ప్రత్యక్షంబగున్; దాన, దు
ర్వ్యవసాయాత్ములు దేవతాంతరము చర్చల్‌చేసి, యన్యోన్య వై
రవిధిన్ బెంచుకొనంగఁజూతు, రటులన్ బ్రాజ్ఞుండువాంఛించునే?

"ననుఁ జేరన్ దెలియంగభక్తియె ప్రధానంబై చనున్; వేష భా
షణముల్ ముఖ్యముగావ"టంచనఁడె? యాసర్వేశుఁ;డట్లాట-వం
చనకున్‌జిక్కని భక్తియున్, సుజన సంసర్గంబుఁ, ద న్నామ కీ
ర్తన సేవాదికముల్ శరణ్యములు భక్తశ్రేణి కెంచేనియున్.

భక్తుల్ నిత్య విరక్తియుక్తులును, నిస్స్వార్థప్రవృత్తక్రియా
సక్తుల్, భూతహితానురక్తులును, శశ్వత్సాధు పావార్చ నో
ద్యుక్తుల్, సత్యవచోనియుక్తులు మహాత్ముల్‌గానఁగానేర్తు రీ
భక్తక్రీతుఁడవైన నిన్నిట; విఠోబా! పాండురంగప్రభూ!

పాండురంగనాథ భక్తవిజయము మ
రాటి భాషనుండి తేటతెనుఁగు
బాసఁబలికినట్టి భక్తునికోయిల్ ధ
నాల దేవరాజు వ్రాలికొలుతు.

ఓమ్

నమః శ్రీకృష్ణాయ భగవతే,

శ్రీ సాయీ సద్గురవే నమః

# శ్రీ పుండరీక చరిత్రము.

శ్రీ తరుణిఁగూడి, యాశ్రితు
మాతా పితృసేవమెచ్చిమదిఁ, బండరినిన్
ఖ్యాతిగ వెలసిన భక్త
వ్రాతేడ్యునిఁ బుండరీకవరదుని గొలుతున్.

శ్రీపతిధ్యాన నిష్ఠా విశిష్టులైన
శౌనకాదులు నైమిశ కాననమున
నఖిల శాస్త్ర పురాణేతిహాస విదుని
సూతుఁ గన్గొని వినయ సమేతులగుచు.

అరయఁ బాదరాయణు కృపాతిశయంబున విశ్వమందు నీ
నేరని యంశముల్ గలుగనేరవు; సర్వవిదుండ వీవ, యీ
భారతఖండ మందెటులఁ 'బండరిఁ' దీర్థముక్షేత్రదైవముల్
చేరి యొకంట నెంతయుఁ బ్రసిద్ధినిఁగాంచె? నెఱుంగఁజెప్పవే!

వైకుంఠధామమును విడి
శ్రీకాంతుం డీ విధమున శ్రితసులభుఁడు భ
క్తాకర్షితుఁడై మెలఁగుట
కే కారణమో వచింపవే! మహితాత్మా!

అని ప్రార్థించిన శౌనకాదుల తెలియంగగ్గించి, యా సూతుఁ డి ట్లనెఁ, గైలాసమునందుఁ బార్వతియు మున్నాశంకరుఁగాంచి మీ రు నన్నుఁగోరినరీతిఁ దా నడుగ, భర్గుం డెంతయుఁ మెచ్చి, తె ల్పిన వృత్తంబు నెఱుంగఁబల్కెద సమాలింపందగుఁ శ్రద్ధమై.

దండక వనమున డిండీరుఁడను ఘోర
రాక్షసనాథుండు ప్రబలుఁడగుచు
మునులను సాదు సజ్జనముల దయమాలి
యెడపక మిగుల హింసించుచుండ
నార్తరక్షణ పరాయణుఁడు శ్రీహరి మల్లి
కార్జునుండనఁగఁ దా నవతరించి
లోహ గదఁ బూని యాహవంబందు సు
రారినిఁగూల్చె. డిండీరుఁడపుడు

శ్రీపతినిఁగాంచి వరము నర్థించె భక్తి;
"లోహ దండ ఘాతనమున సాలోక్యమిడితి
కరుణ, నిట లోహదండమఁ పురి తనర్చు
నటులఁ గృపసేయవే! స్వామి!" యనుచు వేఁడ.

అటుల యౌఁగాక యని ప్రభుండతని కోర్కె
నెఱపె, లోహదండంబను పుర మొకండు
తనరె నచ్చోట – నగరీ మతల్లియగుచు;
ప్రజలు బహువిధానేక సంపదలఁ బొదల.

ఆ నగరిన్ వసించె నిరతాగమవేదియు సత్యశీలియున్
మానిత కర్మనిష్ఠుఁ డసమాన దయాది గుణాఢ్యి, శ్రీపతి
ధ్యాన రతాత్ముడున్ సుకృతి, న్యాయపథానుగతుండు జ్ఞాన వి
జ్ఞానసమేతుఁడౌ ద్విజుఁడు జహ్నువు నావిబుధుల్ నుతింపఁగన్.

కుల గుణ రూపసంపదలకున్ దనకీడగు తొయ్యలిన్ నెలం
తలఁ దలమానికంబయినఁ దానిఁ, బతిన్ నిజదైవతంబుఁగాఁ
దలఁచెడిదాని, బంధుగులఁ దాలిమిమైఁ దలలోనినాల్కఁగా
వెలిగెడుదాని, 'సాత్యకి' నిఁ బెండిలియాడె నతండు ప్రీతుఁడై.

దంపతులు పేర్మి గార్హస్థ్య ధర్మములను
బఱపి, సంతతిలేమికి వగచి, పెద్ద
కాలము వ్రతంబులొనరించి కనిరి తుదకుఁ
దను జితేందిరాతనయునిఁ – దనయు నొకని.

చారుతరాకృతిన్ గలిగి జన్మమునొందుటఁ 'బుండరీకుఁ' డన్
బేరిడి పెంచి, పుత్త్రు నుపవీతునిఁజేసి సమస్తవిద్యలన్
నేరిపి, యాగమాధ్యయన నిష్ఠునిసల్పి గృహస్థధర్మ మే
పారఁగ సాధ్వినోర్తుక వివాహముసేసిరి; - యంత నాతఁడున్.

ఆర్జవమేది, బంధు పరిహాసము నోరిచి, పూర్వజన్మ క
ర్మార్జిత దుష్క్రియాకలిత మానసుఁడై గృహసీమ మెట్టకే
దుర్జనులైన తార్పరులు తోడుఁగ వేశ్యలఁగూడి మాడి, య
త్యూర్జిత వంశగౌరవ ధనోత్కరమున్ వ్యయపెట్టె నెంతయున్.

తనయుని నీచవర్తనముఁ దల్లియు దండ్రియుఁగాంచి ఖిన్నులై
పనివడి బంధుమిత్రులగు వారలచే హితమాడఁబంచి, వ
ర్తనమది మానకున్న, నొకదారిమఱల్ప మదిఁ దలంచి, తా
జనకుఁడు పుత్రునిఁ బిలిచి సాంత్వనసూక్తులఁబల్కె నివ్విధిఁ.

సత్యముపైఁ బ్రమాణమునుసల్పి వచించెదఁ బుత్ర! యెట్టి సాం
గత్యము లేకయుంటఁదగు కార్యము, తప్పదయేని సాధు సాం
గత్యము భద్రమూల - మదికల్గిన దోసములేదు; దుష్టసాం
గత్య మనర్థకారణము కానఁ బ్రయత్నమునఁ ద్యజింపుమా!

ఇలువడిఁగూల్చి, ధర్మసతినెంతయు వంతలపాలుసేసి, వృ
ద్ధులమగు మమ్మునిద్దఱను దుఃఖమహాంబుధిలోనఁ ద్రోసి, నీ
కులమును ధర్మముఁ జెఱచి కుంటెనకాండ్రను జేరఁదీసి, వే
శ్యల గృహవాసముల్ సలుపసాగితి వెక్కడి పాపబుద్ధివో!

ధనమదిడిందుఁ, బూర్వసుకృతంబులు నాశనమొందు, నాపదల్
వెనుకొను, బంధుగుల్ హితులు వియ్యము నెయ్యముఁ బాప రెయ్యెడఁ
దనువు బలంబుడుల్లు, దురితంబులుసేకుచు నారకంబుఁ గ
ల్గును, ధనకామినీజనముఁగూడెడి కూళలకుఁ - గుమారకా!

ధనముగలంతకాలమును దాయుచుఁ బ్రేమఘటించు, రా ధనం
బును నశియించెనేనిఁ బెడమోములఁదాల్తురు, నీతిలేద; దు
ర్మనము దురాశలుఁ దురభిమానము వారికి వెన్నతోడఁ బె
ట్టినయది, లేనికూర్మిఁ బ్రకటింతురు సంతత మాటకత్తియల్.

ఎన్నో నోములు నోచి వేలుపుల కెన్నెన్నో నతుల్ సల్పి నిన్
గన్నా మన్నరొ! పూర్వపుణ్యమున; రైకాంతాజనాసక్తిమైఁ
జన్నే? యీగతి యౌవనంబు ధనముల్ సర్వంబుఁగోల్పోవ, మా
ఖిన్నత్వంబును బాపి యింతనయినన్ క్షేమంబడన్ జూడుమా!

అని, జనకుండు పల్కు నుడు లాత్మహితంబయినన్ దురాగ్రహం
బును గని, పుండరీకుండు సుబుద్ధినిఁగోల్పడి తల్లిదండ్రులన్
దనువుల శోణితంబు రాల దండమునన్ బడమోది, తిట్టి, భా
ర్యను గొనిపోయి వేరొకగృహంబున నెప్పటియట్ల యుండినన్.

లేశమునైన బుద్ధి సుఖలింపఁగఁజాలమి నేకపుత్త్రుపై
నాశను రోసి, ప్రేమ మొదలంటఁగఁద్రోసి విరక్తచిత్తులై
కాశిని జచ్చినన్ సుగతిగల్గు నటంచెదలోఁదలంచి, వి
శ్వేశుని సన్నిధానమునుజేరఁగ సాత్త్వికజన్ము లంతటన్.

వారణాసిని వెగటవారిఁ గూడ
నడుప నోపకపోనున్నఁ బడుచు లేచు
చక్షులోఁ బోవుచుండిరి; యట సుతుండుఁ
గాంచనాంబచేత వేడుక కపలుకొనఁగ.

వెలయాండ్రన్ దగినంత విత్తమున సంప్రీతాత్ములన్జేసి, వా
రల యాజ్ఞలోఁగాని, మేటి యశ్వముల భార్యాయుక్తుండై జోడు రౌ
తుల నెక్కి స్వారిఁ జేయుచున్ వనములందున్గల్గు దృశ్యంబులన్
గనుచున్ జూచుచుఁబోవు నాతనికి దుర్గంబైన మార్గంబునన్.

పటుతర వార్ధకంబగుటఁ బాటవమేది వడంకు మేనులు
త్కటమగు క్షుత్పిపాసలకుఁ గాసిలు తల్లినిఁ దండ్రిఁజూచి, యా
కుటిలుఁడు లేశమేన్ మదినిఁగుందక కందక పల్కకే - రయం
బటవినిదాటి, కుక్కుటమహాముని పర్ణకుటీరసన్నిధిన్.

వఱలు - ధర్మసత్రమున నశ్వములడిగ్గి
విడిసె నారాత్రి నచ్చోటఁ గడపు బుద్ధి;
పుండరీకుని పూర్వంపుఁ బున్నెమేమొ!
పతితపావను మునిఁగాంచు భాగ్యమొదవె.

అనిశముఁ దల్లిదండ్రుల సమాహితబుద్ధిని భక్తి సేవలన్
దనుపుచుఁ, జెంత జన్మ మరణంబులఁబాపు మహాత్ములైన స
జ్జనుల చరిత్రలన్ బఠన సల్పుచు నొక్క నిమేషమేని వా
రిని విడనాడకే యుపచరించు సమంచిత యోగయుక్తునిన్.

దేవతలన్ యజించుటలు, తీర్థములందుసఁ గ్రుంకులాడుటల్
పావనమైన క్షేత్రముల వాసమొనర్చుట, యోగముద్రలన్
భావనసేయుటల్, జపతపంబులు సల్పుటలేమి నేరకే-
దైవములంచుఁ గన్న తలిదండ్రులఁగొల్చు మునీంద్రపండితున్.

కాంచి, మునినిసమీపించి, "కాశి యిచట
కెంతదవ్వుండెనోయెఱిగింపు" మనుఁడు:-
'కాశి' యన నేమొ! యేమూలఁగలదొ! దాని
రూపమెట్టిదియో - తా - నెఱుంగ - ననిన.

పరిహాసంబునుజేసి "నీవును నరప్రాయుండవే? కాశికా
పురికిన్ జేరుపనుండి, దానిఁ గనఁగాఁబోనంచు వాక్రుత్తు; స్వో
దర సంరక్షణమాత్ర కాసపడి, మిథ్యావేషముల్ పూని, యె
ల్లర వంచింపఁదలంచు నీ బ్రతు కదేలా? మంటలోఁగాల్పనే?"

అని, యవినీతులాడి, నిలయంబునకున్ జని, పుండరీకుఁ డొ
య్యన నిదురించి, రేయి సగ మావల మేల్కొని, నీల దేహముల్
దనరఁగ భీకరాకృతులఁదాలిచి, కుక్కుటమౌని సద్గృహం
బున కరుదెంచు వారలనుమువ్వురఁ గాంచి భయాకులాత్ముఁడై.

కలయొ! యథార్థమా! కనఁడు; కన్నులుమూయక చూచుచుండె,వా
రలు మునియింటి ముంగిటను బ్రాఁచిని నూడిచి నిర్మలోదకం
బులఁ బరిశుభ్రమున్ సలిపి ముగ్గులఁబెట్టుఁడుఁ దొంటివేసముల్
తలఁగఁగ స్వచ్ఛ కాయములఁదాలిచి క్రమ్మఱుచుండ నీతఁడున్.

ఎదురుగనేగి "మీరలెవ? రెయ్యదివాస? మిటెందుఁ బోదురో?
మొదటి పిశాచరూపములు పోయి పవిత్రములైన మేను లె
ట్లొదవెను? మీకు; నాశ్రమముసూడిచి నీరముఁజల్లనేల? యీ
యదనున - మీచరిత్రలు యథార్థముఁదెల్పుఁడ" టంచు వేడినన్.

వారి మువ్వురలో నొర్తు పలికె నిటుల-
"ఎట్టి సుకృతుల నేని క్షయింపఁబోని
పాపకర్ముఁడ! నిన్ జూడఁ బాపమొదవు
తలఁగు - మాతా పితృద్రోహి!- తొలఁగు"- మనిన.

అడరును జోద్యమున్ గదుర నాతఁడు వారలమ్రోల సాఁగిలం
బడి, "జనయిత్రి! నా సలుపు పాపములన్ గనుగొన్న నీవ - బి
డ్డఁడ నిదె నీ పదాబ్జముల డాసినవాఁడ, దయారసంబు చొ
ప్పడఁగఁ బవిత్రుఁజేయు" మని ప్రస్తుతిసేయ దయార్ద్రచిత్తయై.

గంగ వచించె, "మమ్ములను గ్రాగానఁగరా దొరు లెంతవారికే
నిం, గతరాత్రిఁ గుక్కుటమునిం గనుభాగ్యము నొందియుంట నీ
కుం గుఱియైతి, మీర లనుఁగుంజెలియల్-యమునా సరస్వతుల్
గంగను నేను; మాచరితలన్ సకలంబెఱిఁగింతు విప్రుఁడా!

నిచ్చలు నీసముల్ పరమనీచులుఁ గల్మషు లెందరెందఱో
వచ్చుచు మా జలంబులను వారవగాహన మాచరించుటన్
సచ్చరితాత్ములౌదు; రఘసంతతియెల్లను మమ్ముఁగ్రమ్మ, మె
మిచ్చట కేగుదెంచినపు డేగతినుంటిమొ! యట్లు - మూర్చెడిన్.

అటు కలుషాగ్రకాయములనందిన మా యఘము నశింపఁ గు
క్కుటముని యింటిముంగిట నకుంఠితభక్తినిఁజేరి, యుక్తి చీ
కటిఁ గసవెల్ల నూడ్చి, యుదకంబుల శుభ్రముసేసి, మ్రొక్కి, మొ
ప్పటివలె స్వచ్ఛదేహముల వర్తిలుచుందుము నిచ్చలివ్విధిన్.

చేరినమాత్రఁ బాపములఁ జేష్టదఁజేయుఁగఁబాలు మానిని నె
వ్వార మెఱింగిపల్కు?" నన, స్వర్ణదిఁగాంచి, "జనాళిదోష సం
హారము నీవ సేయుఁగల - వయ్యొడ, మీ యఘపుంజమెల్ల నీ
తీరునఁ బాపనోపు పటుతేజము నాతఁ డెటుల్ గడించెనో?

దాన ధర్మంబులను, జప తపము లాచ
రించెనేమి?''- నా, గంగ పచించె; ''విప్ర!
దాన ధర్మంబులును జప తపములేల?
తల్లి దండ్రుల సేవించు ధన్యులకును.

తల్లి దండ్రులకును సేవలు సల్పువారలు
పుణ్య తీర్థంబుల మునుఁగనేల?
మాతా పితలకు నమస్కృల నిడువారు
జపములుఁ దపములు సలుపనేల?
జననీ జనకుల కర్చనలు సల్పెడివారు
నదుల నుదధులను వెదకనేల?
కన్నవారల కనుసన్నలఁ జనువారు
పెర వేలుపులను సేవింపనేల?

జన్మ కారణులను గొల్చు సజ్జనులకు-
భూ ప్రదక్షిణములు - యోగ ముద్రలేల?
ప్రాణ నియమంబులేల? కర్మంబులేల?
వేద పఠనము లధ్యాత్మ విద్యలేల?

వినతిఁ గుక్కుటమౌని నిచ్చలును సద్విజ్ఞాన సంపన్నుఁడౌ
చు "నమాతుః పరదైవతం" బను మహాసూక్తిఁ-మదిఁ నిల్పి, య
ర్చనఁగావించును వారి నేడుగడఁగా స్వాంతంబునఁ నమ్మి; త
జ్జనయిత్రీ జనకార్చలం గలిగె విశ్వస్తుత్య సామర్థ్యముల్.

తలినిఁ దండ్రిని నిందసేయు చెనటుల్ ధాత్రీస్థలిఁ నీచ యో
నులయందుద్భవ మొందుచుందు; రిహమందుఁ
తత్పరంబందునేఁ
గలుగంబోవదు వారికెట్టిసుగతుల్, గల్పంబులెన్నైన; వా
రల వీక్షించినఁ గోటిజన్మ సుకృతార్థంబెల్ల నాశంబగుఁ".

అని, పలుకఁ, బుండరీకుఁడు
విని, వెఱఁగును సిగ్గు భీతి పెనఁగొన, భక్తిన్
వినువాఁక యడుగుఁ దమ్ములఁ
బ్రణమిల్లుచు గద్గదస్వరంబునఁ బలికెఁ.

ఎడపక నాదుతండ్రి హిత మెన్నియొమాఱులుఁ బల్కెఁగాని నేఁ
బెడచెవిఁబెట్టితిఁ, బితల వేయితెఱంగుల నొంచినాఁడఁ, బా
పుడ, శరణంటి - నేగతినిఁబ్రోచెదవో? జననీ! యెఱుంగవే?
పుడమిని 'స్వాశ్రితావన సమో నహి ధర్మ' మటన్న సూక్తినిఁ.

అంచుఁ దేవ ధునీపదంబుల శిరంబానించి, పెల్లార్చి. ప్రా
ర్థించఁ విప్రు ననుగ్రహించి, కరుణార్ద్రీభూతలై "బిడ్డ! దు
స్సంచారంబును సల్పితింతవడిఁ, బశ్చాత్తాప మత్యంతముఁ
గాంచంగల్గుట సాధువర్తనము లక్ష్యంబయ్యె నిప్పట్టునఁ.

తలియుఁ దండ్రియు ధాత్రిపై నరుని ప్రత్యక్షంబు నౌ దైవముల్;
తెలియంజాలక యీరహస్య మధముల్ - తీర్థంబులుఁ బుణ్యభూ
ములు, దైవంబు, లటంచు వానిఁగనఁగాఁబోచుందురిందందుఁ; బ్రా
జ్ఞులు, మాతా పితృసేవ సేయుదురు సంశుద్ధాంత రంగంబులఁ.

జన్మములు కోటిసేసిన, సకల పుణ్య
తీర్థములఁ గ్రుంకినను ధరిత్రి ప్రదక్షి
ణముల నరుఁ డారుమాఱులొనర్పఁ గనిన
మాతృ పదవందనంబు సమంబుగావ.

పఱగ వారాణసీపురీవరము రెండు
లక్షలతడవల్ భక్తి ప్రదక్షిణంబుఁ
జేయు సత్పురుషుం డుపార్జించు ఫలము
మాతృపదవందనంబు సమంబుగాదు.

ఆకసముకంటె నున్నతుఁడగును దండ్రి,
జనకు పదవందనమున సుజ్ఞానమొదవు;
ధరణికంటె విశాలమైతనరుఁ దల్లి,
మాతృసేవ మోక్షదమని మాన్యులండ్రు.

మాతాపితృ సేవకుఁగని
మితి మోదంబునొందు శ్రీహరి, భక్త
వ్రాతేప్సుఁడు ప్రత్యక్షం
బై, తపము కొసంగు నతని కఖిలార్థంబుల్.

నీ వింకనేని వృద్ధ జననీజనకుల్ ముదమొంద వారలఁ
దైవములంచు నమ్మి సతతంబును సేవలఁదన్పుదేనిఁ, ద
త్పావనవృత్తిఁ బాపములువాయును, యోగివరుండవౌదు, నిఁ
దేవతలేని దాని వినుతింతురు, దైవముమెచ్చు" నంచిటుల్.

ప్రియము హితంబులాడి, యవివేకముఁబాపి, పవిత్రుఁజేసి గంగయు యమునా సరస్వతులుఁ గన్నొఱఁగఁ జనఁ-బుండరీకుఁడెంతయు వినయంబు భక్తియునుదారొక్కనఁ గుక్కుటమౌనిఁజేరి, సత్క్రియల సమర్చసల్పి పరిదేవనముఁ బొనరించి యిట్లనెఁ.

"అనఘా! నీదు మహత్త్వ మే నెఱుఁగకే యజ్ఞానినై నింద్యభాషణముల్ వల్కినపాపుఁడఁ నను గృపాస్వాంతంబునఁ సైచి, పావనమార్గం బెఱిఁగించి ప్రోవు" మనుచుఁ బ్రార్థింప నా పుండరీకుని సద్భక్తికిమెచ్చి మౌని విహితోక్తుల్ బోధఁ గావించినఁ.

మునికి నమస్కృతుల్ సలిపి పో సెలవుంగొని, భార్యతోడ వాహనములనేగి నట్టడవియందున గాసిలు తల్లిదండ్రులఁ గని, కడుభక్తియుఁ బ్రియముఁగౌరవముఁ భయముఁ వెలుంగఁ ద్రొక్కన సుతుఁగాంచి నిక్కువమొ! కేవల మాయయొయంచు వారలుఁ.

ప్రముదమునొంది. బుద్ధి పరివర్తనగల్గుడు వారి పూర్వ పుణ్యమున సుతుండుదక్కనని యా పరమేశునిఁ బ్రస్తుతించి, పాదములనుబడ్డ బిడ్డని నుదారత నక్కునఁజేర్చిపట్టి, మూర్ధముఁ బలుమాఱు మూర్కొనఁగఁ, దల్లికిఁ దండ్రికిఁ బుత్త్రుఁడిట్లనెఁ.

నీచుఁడఁ బాపుఁడఁ విహితనీతులఁబల్కిన మిమ్మెదిర్చి సంకోచములేక, దుర్జనులఁగూడి చరించుచు మీదుసేవకే నోచుకొనంగనైతి, సుజనుల్ హితబోధముసేయఁ బెల్లుమైఁ ద్రోచితి బుద్ధిజాడ్యమిదె దోసలినొగ్గిద నన్ను సైపరే!

అని వారిఁ క్షమియింపవేడికొని, యశ్వారూఢులఁజేసి, పుణ్యనదీసేవలు క్షేత్ర తీర్థముల దైవారాధనల్‌గూర్చి, నెమ్మనమందుంగల కాంక్షితంబులను సంభావించి యీడేర్చి వారిని స్వస్థానముఁజేర్చె నెంతయుఁ బవిత్రభూతులై మోదిలఁ.

సురసది హిత శిక్షణమును
గురుసేవా నిరతుఁడైన కుక్కుటముని శే
ఖరుబోధ పుండరీకునిఁ
బరిపర్తనఁగూర్చి శుద్ధభావుని జేయఁ.

చలిచీమనేనియుఁ జాఁద్రొక్కఁజాలఁ డా
పదలనేఁ గల్లలఁ బలుకరాఁడు.
పాపులుండెడి దిక్కుఁ బరికింపఁగాఁబోఁడు
కలిమి కుబ్బఁడు లేమిఁ గలతఁబడఁడు
తలయెత్తి యితరకాంతల నవలోకింపఁ
డన్య ధనంబుల కాసఁగనఁడు
నీచునిస్నేతము నిందింపఁ దలఁపఁడు
పరుల బాధలకు నోర్వంగలేఁడు.

సకలభూతములందున సమత మెలఁగు,
కామ క్రోధాది రిపులచేఁ గట్టుపడఁడు
పూర్వజన్మ సంపాదిత పుణ్యగరిమఁ
బుండరీకుండు - సద్గుణపూరితుండు.

కూరిమి నేరిమిఁ గలిగి కుక్కుటమౌని నిమించి, సేవ ల
వ్వారిగఁ దల్లిదండ్రులకు భక్తిమెయిఁ బొనరించి, సాధు సం
స్కారమునన్ సమస్తకలుషంబులఁ ద్రోసె; మహాత్మగోష్ఠి యా
తీరునఁ బుండరీకుని మతిన్ బరివర్తనసేయు టబ్రమే!

కనఁబోని కఠినుఁడు — మును మున్న మేల్కాని
జననీ జనకులకుఁ బ్రణతులొసఁగు,
పిలిచినఁ బలుకని తులువ — దాఁపునఁజేరి
యడిగి వారలకోర్కు లమరఁజేయు,
బ్రతిమాలినను రోసపడుకోపి — వారి యా
నతి తలఁదాలిచి సతము మెలఁగు,
కోరి రమ్మనినను జేరని కూళ — రే
యిం బవళ్ళనక దాస్యంబు సలుపు,

తినెనొ తొడిగి నిద్రించెనో కనని చెనఁటి,
తినఁగ బెట్టియుఁ గట్టి నిద్రింపఁజేయు;
నట్టివాఁ డింతలో నిట్టులగుట కేమి!
సాధు సాంగత్యమునకు నసాధ్యమున్నె?

గృహమున దాసదాసిక లనేకులు బంధుజనంబులున్నఁ బ్ర
త్యహమును దల్లిదండ్రులకుఁ దా నొకఁడే సకలోపచారముల్
సహనముఁగల్గి సల్పు శ్రితులన్ దగు విందులఁ బన్పుచున్ శుభా
వహముని భుక్తశేషమును బారణసేయును దాను భార్యయున్.

నిదురలేపుడు నెట్టి ముదిసమంచని తల్లి
దండ్రులపాదాలఁ దలనువేర్చు,
నడచిన పదులు తడఁబడునని వారి
కొనవ్రేళ్ళనెడిగి కేలూతనొసఁగు
చలిక బంకుదురని నులివెచ్చ నీర్వోసి
తడియొత్తి మడుగులఁ దాస కట్టు.
నడు గవెన్నాఁడుదురని తానె గ్రహియించి
తినుఁడని యువి యువితెచ్చి పెట్టు,

శ్రీమదు వారింపఁ దలల నంకములఁజేర్చి
విసనలుదైవి నిద్దురవోవఁబుచ్చు;
జనని జనకుల దైవములనుచుఁ గొలుచు –
పుండరీకుండు – సద్భక్తపుంగవుండు.

ఈ పగిదిన్ సపర్యలొనరించుచు నిచ్చలుపుచ్చు వాని మా
తా పితృభక్తినెంతయును మనంబునుగాంచి, కరంబుమెచ్చి, రా
ధాపతి సాధుభక్త పరతంత్రుఁడు గావున నాశ్రితౌఘ సం
తాప నివారకంబయిన దర్శనభాగ్యమొసంగ నెంచుచున్.

కాళ్ళపై గజ్జియల్ ఘలు ఘల్లుమనుచుండ,
మొలయందుఁ గింకిణుల్ మొఱయుచుండ
కరములఁ రత్నకంకణములు మెఱయంగ,
తనువుపై పీతవస్త్రంబు దనర,

ఉరమున హారము లొండొంటి నొరయఁగ
కర్ణ కుండలముల కాంతి వెలుఁగ
ముఖ బింబమునుగ్రమ్మి ముంగురుల్ ప్రేలాడ
సిగఁబింఛమకుటముల్ చెలఁగుచుండ.

గజ వృషభ సింహ డింభక గమనములను
ననుకరించుచు నీల రత్నాచలంబు
వచ్చెనన డాసి, సుస్మిత వదనుఁడగుచు
నెలమిఁ బుండరీకునివెన్క నిలువఁబడియె.

తనతొడ లుపధానములుగ
జననీ జనకుల కొసంగి సాదరమున ని
ద్రనుబుచ్చ వీవనల మె
ల్లన వీచుచునుండె సుతుఁడు లక్ష్యైకమతిన్.

తనవెనుకన్ నిలంబడి ముదంబునఁ దా నొనరించుసేవ తె
ల్లను గనులారఁగాంచు కమలాపతి నీలతనుద్యుతుల్ - మణి
కనక కిరీట విస్ఫురితకాంతులు నొక్కటఁ బుండరీకు మ్రో
లను వెలుగంగ, వెన్కఁ గనులన్ మఱలించుడు-విస్మితాత్ముఁడై.

జల జాతాసన వాసవాద్యమరులే సర్వాత్ము దర్శింప ని
చ్చలు నెన్నోగతులన్ శ్రమంపడియు లేశంబేనిఁ దద్దివ్య మం
గళరూపంబు నొకప్పుడేన్గనరొ యా కంజాక్షుఁడే నేఁడు ని
శ్చల మాతాపితృభక్తిమెచ్చి తనపజ్జన్నిల్వ వీక్షించియున్.

శకున్నకు దైత్య శాపమోచనము సేయఁ
బుండరీకుని సేవలఁ బొందఁగోరి
కటిక యిటుకను నిలఁబడెఁ గటి తటమునఁ
గేలు గీలించి సద్భక్తలోలుఁ డపుడు.

గోపాలమూర్తి దివ్య
శ్రీపాదము సోకినన్ బ్రసిద్ధ తనుండై
శాపమును బాసి, హరిని, శ
చీపతి వినుతించి యాజ్ఞఁజేకొని చనియెన్.

తమనిద్రన్ బిత లుజ్జగింప, సుతుఁ డంతన్ లేచి దండప్రణా
మములన్ మాటికిసల్పి, కృష్ణు పదపద్మంబుల్ మహానంద బా
ష్పములన్ క్షాళనసేసి, యోగవిదు లేచాయన్ గనన్ బోని త
త్త్వము చేఁజిక్కెనటంచు సుస్థిమిత చేతస్ఫూర్తి వర్ధిల్లగన్.

శిరమునువంచి యంఁజలి రచించుచు జానులవ్రాలి గద్గద
స్వరమున సమ్మదాశ్రువులు చక్షులగ్రమ్మకొనంఁగ, నంగముల్
కరము వడంక, భక్తి కుతుకంబులుఁ బెన్గొన, నేర్చినట్లు శ్రీ
హరిని నుతించినంత, జలజాక్షుఁడు భక్తునిఁగాంచి యిట్లనెన్.

నీదు గురూపచారముల నెమ్మదిమెచ్చితిఁ, గోర్కెఁదీర్తు, నీ
కేది హితంబొ! వేడుకొనుమీ!-యని నంతటఁ, బుండరీకుఁ డ
త్యాదృతి "నిన్ను నా శరణమంచని నమ్మితి - సర్వమీవ; బ్ర
హ్లాదులకేని దుర్లభుఁడ వట్టి నినున్ గని యేమికోరుదున్.

తలఁపుల్ నిల్పను భోగలాలసుఁడనై ధర్మార్థ కామంబులన్
గలుగంగాఁ దగు నా సమస్తమును బ్రాక్కర్మాను సారంబుగాఁ
జెలఁగున్, గాని, భవత్పవిత్రపద రాజీవ ప్రతిష్ఠావ్య ని
శ్చల భక్తిన్ గలిగింపఁగోరెదను కృష్ణా! జన్మ జన్మంబులన్.

సరసిజగర్భ దేవముని సంస్తుత! త్వత్పదకంజపంజరాం
తరమునఁ జేరనిమ్ము ప్రభు నా దగు మానస రాజహంసమున్
గుప కఫ వాత పిత్తములు కుత్తుకనడ్డుచు బాధపెట్ట నీ
స్మరణము సేయఁజాలుటయసాధ్యమె? మృత్యువు డాయుపట్టునన్.

ఉపతృష్ణా సలిలంబులున్ మదనవాతోద్ధూత మోహోర్మి కో
త్కరమున్ బంధు జలేచరంబులుఁ గళత్రావర్తముల్ గల్గు దు
స్తర సంసార మహోగ్రసాగరము మధ్యన్ మున్గు నాకిమ్ము నీ
చరణాంభోరుహ భక్తిపోతమును కృష్ణా! ఆర్తసంరక్షణా!

పుట్టినదాది నీచులనుపొందితిఁ దల్లికిఁ దండ్రికెన్నొ యి
క్కట్టులఁగూర్చి, వారిఁ గడు గాసిలఁజేసితిఁ, బాపరాశికిన్
బట్టయితిన్.- సురాపగయుఁ బావన కుక్కుటమౌని బోధ లి
ప్పట్టున ధన్యుఁజేసె; శ్రితవత్సలు నిన్గనులారఁ గాంచితిన్.

పాయనిప్రేమ సన్మఖముఁ బ్రార్థనసేయుమటంచుఁ బల్కితీ
వీవెడ నాకు-దర్శనము నేవిధినిచ్చితొ యట్టి నీదుభ
ద్రాయతమూర్తితోడ నిరతం బిచటన్వసియించి, మోక్ష సం
ధాయక! క్షేత్ర తీర్థ వరదైవము లొక్కటఁగూర్చి ప్రోవవే!"

నావుడు; మెచ్చి వానివచనంబుల, నిట్లనె నీదుకోర్కె నేఁ
దోవను; పుండరీకవరదుండను గావున "పాండురంగఁ" డన్
బావన నామమూని యిట వాసముఁగందు, వికుంఠధామమే
నీ 'విఠల' ట్లుగాదు - వరమిచ్చితి నీపయిఁబ్రేమ పెంపునన్.

సేవలఁ దల్లిదండ్రులకుఁజేసెడివేళను నీదువెన్క మో
దావహమంది నిల్వఁగని యాసన మీ విడినట్టి దీన - నీ
పావన విఠ్ఠలందున సపర్యలఁగంటినిఁ గాన భక్తులన్
బ్రోవఁగ నింక నే విఠలమూర్తియు విఠ్ఠలటంచు నొప్పెదన్.

నీవలె జననీ జనకుల
సేవలఁగావించు సాధుచిత్తులఁ గనఁబో
నీ వసుధ; - నన్యసేవ జ
నావళికి గజావగాహనం బగుఁగాదే!

నీ పితృభక్తిఁగూర్చి యవనీజనమెల్ల నుతించుగాత! మిం
కీపురి 'పుండరీకపుర'- మిర్యాది 'పండరి' యిద్ది "పాండురం
గాపురమంచు నెల్లరును గౌతుకమొప్ప స్తుతింతురిగాత! సి
ద్ధాపగలన్ని యిందు సతతంబు వసించునుగాత! పూతలై!

ఇందలి భీమశైవలిని యింతటినుండి పవిత్రతీర్థమై
పొందు వహించు; నీవెనుకఁ బొల్చినరీతినిఁ బశ్చిమాస్యుడై
యుండు, నిదెల్లక్షేత్రముల నుత్కటమై వెలుగొందు, నెవ్వరేన్
బొందుడు-రవ్యయంబయిన మోక్షము నొక్కక్షణంబు నిల్చినన్"

కమనీయోక్తుల నిట్లుపల్కి, కమలాకాంతుండు నర్చావతా
రముఁ బొందఁ - విభునట్లు ప్రేమ దయివారఁ వామపార్శ్వంబునఁ
రమయుఁ నిల్చెను; రుక్మబాయి విఠల దర్శస్పర్శసేవాసమా
గమ సంకీర్తన వందనార్చనల భక్తశ్రేణి హర్షింపఁగఁ.

శ్రీకృష్ణాంఘ్రి సరోజ రేణుమహిమఁ స్వీయాకృతిఁ గన్న దే
వౌకాధీశుని యాజ్ఞమేరకు మయుండా పండరిఁ గోపుర
ప్రాకారోన్నత మంటపాదుల నపూర్వ స్వర్గ శిల్పంబు భూ
లోకావాసము సేసెనా విరచనల్ పాల్పారఁ గల్పించుచుఁ.

విష్ణుచక్రము - నా మధ్య విబుధనగరిఁ
గ్రిందు సేయు పండరి - మధ్య బిందుతీర్థ
మలరఁ, దన్మధ్య నర్ధమాత్రాకృతిఁ గను
విఠలను పీఠమొకటి నిర్మించె మయుఁడు.

చంద్రభాగా తరంగ సంచయములొరయ,
సకల పుణ్యతీర్థంబు లం దమరుచుండ,
సముల భక్తశేఖరులు జోహారు లొసఁగ
వెలయు శ్రీ పాండురంగని నిలయ మిలను.

సకల దేవతల్ మునులును సాధువరులు
తాపసులు ముముక్షువులు సద్భక్తులెల్లఁ
బ్రత్యహము 'రఖుమాబాయి పాండురంగ
విఠలేశ'ల మ్రొక్కి సేవించుచుండ్రు.

ఆర్తుఁడై "పాండురంగా!" యన్నఁ బరువెత్తు
విఠ్ఠలేశుని మించు విభువరుండు,
"తల్లి! కావవె! యన్న, దఱిఁజేర్చు రక్షియబాయి
నతకరించెడి కరుణార్ద్రహృదయ.
అడుగుఁబెట్టిన బుద్ధి జడిమ మానుచు భాను
తీర్థ తుల్యంబగు తీర్థవరము.
క్రుంకినమాత్ర భక్తుల పాపములఁబాపు
చంద్రభాగను బోలు సత్ప్రవంతి.

భక్తవరులకు నిలయమౌ పంఢరీపు
రము న కీడగు నతి పవిత్రస్థలంబుఁ
బుండరీకున కుద్దియౌ పుణ్యతముని
నెల్ల జగముల మందునకేనిఁ గనము.

అని, యీరీతినిఁ బుండరీకపుర దివ్యక్షేత్రమాహాత్మ్య మిం
పెనయఁ బార్వతికిఁ శివుండనిన యావృత్తంబు సూతుండు, తె
ల్పినదానిన్విని, శౌనకాదు లతితృప్తిన్బొంది శ్రీ పాండురం
గనిఁ గీర్తించి రితండు సత్యముగ "భక్తప్రకీతుఁ" డంచెంతయున్.

అనుపమ పూర్వపుణ్యము మహాత్ములబోధయు నీచమార్గ ప
ర్తనమును మాన్పఁ గన్న తలిదండ్రులఁ గొల్చెడివేళ శౌరి వా
సినఁ గని లేవకే,- పితలసేవనుసల్పుచుఁ గృష్ణు మెప్పుఁ గాం
చిన ఘనుఁ బుండరీకు నుతిఁజేసెద నౌఁదలనొగ్గి నిత్యమున్.

శ్రీ పద్మపురాణాంతర్గతమగు, శ్రీపుండరీకచరిత్రము సర్వము సమాప్తము

శ్రీకృష్ణార్పణమస్తు!

# శ్రీ పాండురంగ నక్షత్రమాల

గీతగోవింద సత్కృతి నాదరించి భ
క్తానురక్తిని జాటఁగలిగినావు.
కరచరణంబుల నఱికిన మొఱకుల
వాత్సల్యమునఁ జూడఁబనిచినావు
కల్పిత పతిమృతి కథవిన్న క్షణమున
మృతిఁగన్న సతి బ్రతికించినావు
సంపించు మిత్రుల నిందించు శత్రుల
పై సమత్వము జూపఁజేసినావు

స్వీయభక్త మహిమఁ బ్రదర్శించినావు
బాదరాయణాంశ ప్రభవ ప్రసాద!
శ్రీ జగన్నాథ! జయదేవ హృదయనాథ!
రక్షింపుమా యాయాలోల! శ్రీ పాండురంగవిఠల!

సుపతిరూపంబునఁ జోద్యంబుగా జాన
వైరాగ్య భక్తులఁ బఱపినావు
హనుమదాశ్రయమిచ్చి యాదృతి శ్రీరామ
భక్తాగ్రణిగఁజేయఁ బంచినావు.
అష్టపదుపాదుపా యబ్బురపడ నిజ
భక్తమహిమ బోధపఱచినావు
ప్రతి శ్రీరామచరిత్ర మానసమును
పలికించి చిరకీర్తి నెలిపినావు

వారణాసిని శ్రీరామ తారకోప
దిష్ట - నపర వాల్మీకిగ దిద్దినావు;
తులసిదాస గోస్వామి హృజ్జలజమిత్ర!
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

"రావె! భుజింప శ్రీ రంగా!" యనఁగ బాల
హృదయము మెచ్చి భుజించినావు
"కఱకు రొట్టెను దినఁగా దిదె నేయిఁజే
ర్పవె!" యని యొసఁగ సంబ్రమపడినావు
వృద్ధవిప్రుండవై యేకాదశీవ్రత
నిష్ఠా పరీక్షను నెఱపినావు
భక్తుఁ బరీక్షించు ప్రభునిఁ దృప్తునిఁజేయు
మృతధేనువును బ్రతికించినావు

వెస నభేదస్థితి నిరూపించినావు
ఉద్ధవాంశజుఁ గడుఁబ్రేమ నోమినావు
దివ్యమంగళప్రద! నామదేవ వరద!
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

మహితతారకము రామానందువలన ని
ప్పించి, ధన్యాత్ముఁ గావించినావు
ధ్యానమగ్నుండైనతఱిఁ జేరి మగ్గాన
నిశలెల్ల వస్త్రముల్ నేసినావు
సుతుని సతిని భాగవతసేవకై పాయఁ
బ్రాణ మానములఁ గాపాడినావు

వేలకొలంది 'సాక్షుల' ను బాడించి
యిహపరార్థములఁ గల్పించినావు
జాతిమత విపాసుల దుష్ప్రచార మడఁప
నీశ్వరైకత్వమును బలికించినావు
భాసుర శుకాంశ భవ కబీర్దాస వరద!
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

భవు నంశభవుని "నివర్తిదేవు"ని- నన్ను
'నమృతానుభవ' కృతి కంపినావు
బ్రహ్మాంశ జనితు 'సోపాను' దమ్మునిఁగ, మా
యను- 'ముక్తఁ' జెల్లిగ మనిచినావు
మహిషంబుచే వేదమంత్రముల్ పలికించి
ద్విజగర్వ మడఁచి దీపించినావు
ప్రఖ్యాతుఁడౌ నా 'విసోబా కేసు' విజ్ఞాన
పరిపూర్ణుఁగాఁ జక్క పఱచినావు
ఎలమి జ్ఞానేశ్వరి'ని ప్రభాషించినావు
దీప్త యోగమాయా త్రిమూర్తి స్వరూప!
భక్తమందార! జ్ఞానదేవావతార!
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

ప్రాకులాడుచు వచ్చు నా 'కూర్మదాసు' న
కెదురేగి దర్శనం బిచ్చినావు,
'రాక కుంభారు' ప్రార్థన విని, యావమం
దునఁ బిల్లికూనల మనిచినావు

అడుసునఁ జాఁ ద్రొక్కఁబడిన యా "గోరకుం
భారు" నందనునిఁ గాపాడినావు.
వహ్నిమధ్యను జిక్కువడిన "జగన్మిత్ర
నాగనాథు"నిఁ గావ నేగినావు

నామదేవుని నెపమున జ్ఞానబోధ
స్పర్శ భాగవతు నకు నొసంగినావు
భక్తజనపరిపాల! కృపావిశాల!
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

బహువిధాజాండ సంభరితోదరుఁడవు 'సా
వంతు' నెద నణఁగి మణఁగినావు
గాయాలఁ గనిన 'జోగాపరమానందు'
తనువుఁ జక్కఁగఁజేసి తనిపినావు
పారిమొలనూల్ మిష, హరిహరాఽభేదంబు
'నరహరి'కిని బోధపఱచినావు
భక్తురాలగు 'జనాబాయి' యెంగిలిని న
గించుచుఁ బ్రీతి భుజించినావు

భక్త నామదేవ్ దఱి, జనాబాయితోడ
వివిధరీతులఁ జేరి సేవించినావు;
భక్తహృదయాలవాల! కృపావిశాల!
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

గురుభక్తి తెలుఁగు నా 'గోరక్షు' - 'మత్స్యేంద్రుఁ'
బరిచర్యఁ బ్రకటింపఁ బంచినావు
జ్ఞానదేవాకృతిఁ జ్ఞానోపదేశంబు
'చాంగదేవు'నకు నొసంగినావు
భక్త 'చొకామేళు' పరిభవ మీవ గ్ర
హించి పూజరి గర్వ మడంచినావు
భవ్య కబీరుశిష్యుఁ 'బద్మనాభు'ని నామ
ఫలము నిరూపింపఁ బంచినావు

అపరజుఁడు 'రోహిదాస్' సేవ లందినావు
పరమయోగి 'రామానందు' వలన నా 'పి
పాజి', - సతనిచేఁ 'బులినిఁ'- జక్కఁ బఱచినావు
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

గతజన్మమందు వ్యాఘ్రమును 'పిపాజి'ఁ జే
ర్పించి విప్రునిగఁ బుట్టించినావు
పరమేశు రూపానఁ బురుషకారముఁ గూర్చి
కృష్ణాకృతి ననుగ్రహించినావు
పరివారయుతుఁడవై తరలి తత్పుత్రుని
పెండిలినొగి జరిపించినావు
శ్యామశాసామివై ద్వారవతియందుఁ
బ్రియుని 'హుండి'ని నాదరించినావు

బంధులింట సుతకు సారెc బంచినావు
వే పరీక్షల శ్రితు నిలcబెట్టినావు
సాధుసుఖద! శ్రీ నరసింహమేధ వరద!
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

తగ- డాంకు రా 'రామదాసు' నెలంత ము
కృ అతోడ సరిత్తూcగc గడcగినావు
కల్యాణదాసుని కన్యకాదాన వా
గ్దత్త వృత్తమున సాక్ష్య మిడినావు
జాత్యంధు 'సురదాసు' చక్షులొసంగి, త్వ
దైక్యభాగ్యముc గూర్చి యులరినావు
పాడమి "సేనానావితుc"డవై ప్రభుక్షౌర
మును సల్పి, పాది వరాలునిచినావు

జూదమాడుచు స్వామిప్రసాదమునకు
నెడమకేల్సాచి, వెఱచి, యా కుడికరంబుc
బెంచ 'సాత్వికు' కేల్ ప్రసాదించినావు
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

మానిత భక్తిc 'గూర్మాబాయి' యిడిన గు
జ్జెనగూండ్ల మెసవి హర్షించినావు
జలధిc ద్రోయcబడ 'దశావంతు' భక్తుని
శ్రీకూర్మమై యుద్ధరించినావు

సజ్జనపాదరక్షావహు "మనమోహ
నసురదాసు"న కైక్యమొసఁగినావు
ద్వీపమున నిన్గాంచిబెదరని 'రసిక కు
మార' భక్తునిఁబ్రేమ మనిచినావు

నడికి జంకిన తండ్రి విషంబొసంగఁ
దాగ్రిపు ప్రాణాధికనుబ్రోవనీవ నల్ల
బాటినాఁడవుగద! 'మిరాబాయి' వరద!
రఖుమబాయి లోల! శ్రీ పాండురంగవిఠల!

సాధ్వి 'కన్హోపాత్ర' సాయుజ్యమొంద నా
తనువు భూజముఁజేసి తనిపినావు
లక్షలవరహాల్ తలారివై పతికిచ్చి
'దామాజిపండితు' నోమినావు
జ్ఞాని 'బనుగు'గ 'శాంతబ్రహ్మణి' మహీశు
'మృత్యుంజయు' నను గ్రహించినావు
పరమభక్తుండైన భానుదాసు ని వారు
వము వస్త్రచయముఁ గాపాడినావు

'రామరాజు' కోరికినిఁ దీర్పఁగనినావు
నాగనాథ రూపమున నజ్ఞానమడఁచి
మాన్యుఁడౌ బహిరంభట్టు మనిచినావు
రఖుమబాయి లోల! శ్రీ పాండురంగవిఠల!

భానుదాసునకుఁ బ్రపౌత్రరూపమున 'పై
ఠాను'న నవతారమూనినావు
గురు 'జనార్దను' రూపుఁగొని దత్తసాక్షాత్క్రృ
తిని భక్తునకుఁ బ్రసాదించినావు
భాగవతంబును భావార్థ రామాయ
ణము మరాటీభాష నాడినావు
పండ్రెండువత్సరాల్ పరిచారకుండవై
భాగవతులసేవఁ బఱపినావు

జ్ఞానదేవు సమాధినిఁ జక్క సేయ
నొక వణిగ్రూపమున సాయ మొసఁగినావు
ఆర్తమందార! ఏకనాథావతార!
రఖుమబాయ్ లోల! శ్రీ పాండురంగవిఠల!

నలి నుద్ధవాంశజు నామదేవుని దేవు
పురి జనింపఁగఁజేసి మురిసినావు
మృతిఁగన్న భక్తుని సుతుఁ బునర్జీవితుఁ
జేయించి జనని రక్షించినావు
పత్రికనంపుడుఁ బడతితో గరుడుపై
జని, దర్శనంబిచ్చి తనిపినావు
కుమతు లభంగపత్రముల నింద్రాయణి
వైవ భద్రముగఁ గాపాడినావు

నామ మాహాత్మ్యమును జాటనంపినావు
బొందితో వికుంఠముఁజేర్చి ప్రోచినావు
కామితార్థద! శ్రీ తుకారామవరద!
రఖుమబాయి లోల! శ్రీ పాండురంగవిఠల!

శ్రీ మారుతిప్రియు 'రామదాస' స్వామి
సిద్ధ సమర్థుఁగాఁ జేసినావు
సాధుసేవాపరు 'బోధల బావా' ను
వితరణాగ్రణిగఁ గావించినావు
స్థావరజంగమో జీవనకృతిని "గ
ణేశ నాథుం" డవై నెఱపినావు
భక్తుఁడౌ 'కేశవస్వామి' యర్పించిన
వస నాభి కొంతిగఁ బఱపినావు

భీమనదిని దాటించియు, వృద్ధవిప్ర
రూపమున గోమాబాయి రొట్టె నార
గించి, యా వృద్ధ ననుగ్రహించినావు
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

భక్తుల మహిమంబు పాచ్ఛాకుఁ బ్రకటించి
ఘను 'లతీబ్ సాహెబుఁ' గాచినావు
'సాధుసంతోబా' ను జనములను కమతా
కృతి భీమనదిని దాటించినావు

పుత్రికా పరిణయమునను నీళోబా' కు
నెల్లరీతుల సాయమిచ్చినావు
మారుతిపై మతోన్మాదుల నలయించి
'యుద్ధవ చిద్ఘను' నోమినావు
భక్తుఁడైన పండరి విఠోబా వణిక్కు
దాస వేషాన నేడువందల వరాల
ఋణము యవనవిభునకుఁ జెల్లించినావు
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

సాధు జలంధరు శరణొందు పాపి 'గో
పీచందు' నమృతుఁ గావించినావు
గోరక్షు నంపి, తద్గురువు 'మత్స్యేంద్రు' వ్యా
మోహంబుఁ బెడఁబాపి ప్రోచినావు
హరిభక్తసేవనాపరుఁడు 'నాభాజి' కి
సర్వవిజ్ఞత్వ మొసంగినావు
మానిత సద్గురు నానక్కు చేఁ జిద్వి
లాసముల్ ప్రకటింపఁ జేసినావు

తోటఁ గట్టుపడితివను మాటవినుఁడు
బంధముక్తునిఁజేయఁగాఁ బఱచు "ప్రేమ
బాయి" కిఁ భవబంధముల్ బాపినావు;
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

ప్రియుండు దేవార్చనపేటిక నదిం ద్రోయం
దెచ్చి 'శిలాబాయి' కిచ్చినావు
చాంగదేవ వరప్రసాదుండైన 'విఠోబ'
వడుగును నెరవేర్చి వచ్చినావు
'యాదవ పండితు' పైదలిపురుడుం గృ
ష్ణాబాయివై చని జరిపినావు
చాంగదేవునింబంపి జంగమముల హరి
దాసులం గావించి తనిపినావు

ఉరగదష్టయై మృతింగన్న ధరణినాథ
సతిని బ్రతికించి పతిని సత్కృతునొనర్చి
చాంగదేవున కైక్యమొసంగినావు;
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

ప్రకటిత రామతారకమంత్ర జపనిష్ఠు
'మాండలికప్రభు' మనిచినావు
మృతుని - రామాబాయిసుతు భక్తపదతీర్థ
సేచనజ్ జీవితుం జేసినావు
జానకీపతిచింత సైపని 'రామ రా
జు' నకు స్వరూపముజ్ జూపినావు
నరసింహవేషము ధరియించి శిష్యు హి
రణ్యకశిపు వేషి వ్రచ్చి చంపి,
దశరథుని వేషమూనుచుం దనయు నడవి
కంపి, తద్వియోగార్తి దుఃఖమున నసువు

లుడుగు 'నరహరి' దాసుని నోమినావు;
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

సంతత సాధుపూజా నిరతులను 'ఓ
హాయదంపతులఁ' ప్రేమ నరసినావు
'హరిఅనంతుల' శిష్యు ననువులఁగాపాడ
యమ భయంకర చక్రమంపినావు
సాధుసత్తము 'రామచంద్రభట్టు' ననుగ్ర
హించి సందర్శన మిచ్చినావు
సంయమీశ్వరు 'సుహాక్షా' ప్రార్థనమును మ
న్నించి సద్వృష్టి వర్షించినావు
అమలయోగేశ్వరునిగ - 'పణహాజి' - సతని
కతమునను - గుమాణసింగ్ భూపతిని - సతని
వలనఁ దస్కరు - ముక్తుల నలిపినావు;
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

'శ్యామలావీర' వేషమున శత్రులఁజంపి
'జయమల్లు' రాజు రక్షనిడినావు
ధనకాంక్షఁ దస్కరుల్ తలనుఛేదింప 'శ్రీ
ధరుఁ' గాఁచి దొంగల నణఁకినావు
తెరువరులను దోచు 'హరిపాలదాసు' న
కెల్లసిద్ధులఁ బ్రసాదించినావు
చోరులు హరియించు జోడెద్దుల సృజించి
జంబుదాసునకు నొసంగినావు

బాలుఁడగు 'ధనాజాటుని' భక్తి మెచ్చి,
చేరి, చలిదియన్నంబు భుజించినావు,
అంచితముగ ధాన్యములఁ బండించినావు;
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

సాధు సుఖానందు సతి 'సురసరిఁ' బులి
వలె ధూర్తుఁడార్వఁ గన్పఱచినావు
'అతుల ధర్మ మహింస' - యను బోధనా "హరి
వ్యాసదాసు" నిఁజేయ నంపినావు
ఆ "త్రిలోచనదాసు" నాకృతిఁ జోద్యముల్
ఘటియించి నిజభక్తుఁ గాచినావు
తగవెఱుఁగక రాజు తెగనఱికించ 'స
జ్జనకు' కరంబు లొసంగినావు

నదిని, శ్రీ జగన్నాథార్పణం బటంచు
పాఱవైచిన మణి నిజహారమందుఁ
దాల్చి అంగదన్నపుఁ బ్రేమఁదనిపినావు
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!

ఆ బాల్యముగ 'కుమరాబాయి' భక్తిప్ర
చారిణిఁ గావించి, సాకినావు
త్రిపురదాసుఁడు సమర్పించిన ముతుక
వస్త్రంబుచే సీతుఁ బోఁదట్టినావు
తగ నహింసావ్రత ధర్మము "లాడుబా
వా" ను ప్రబోధింపఁ బంచినావు

'గుణవతిన్' జంపవచ్చిన ఘాతుకుల వ్యాఘ్ర
రూపంబునన్ రూపు మాపినావు
దాది - 'సుహృద' యాశ్రయమహత్త్వమునుగూర్చి
గుణవతిన్, దత్పతిన్- సుతుల నియపురను
బ్రేమఁ బరమభక్తులను గావించినావు;
రఖుమబాయ్‌లోల! శ్రీ పాండురంగ విఠల!

వైరాగ్య విజ్ఞాన భక్తులఁ గూరిచి
షేక్ ఫకీరు సమర్థుఁ జేసినావు
మృతుని జీవితునిఁ జేయించి, "గిరిధరలాలు"
విమల భక్తిని నిరూపించినావు
వినుత కబీరు సేవింపఁ బంచి- "పులకన్న
కార్" నృపాలునకు మోక్ష మిడినావు
అల "జిడతపురము" నపర పండరిఁ జేసి
'కూపకుంభారు' మ్రొక్కుఁ గొనినావు

మృతినిఁ గనిన పుత్తుని బ్రతికించి భక్త
యోగి కమలాకరుని సేవ లొందినావు
నామదేవాది భక్త మానస విహార!
రఖుమబాయ్‌లోల! శ్రీ పాండురంగవిఠల!

అత్తమామలు పెట్టునారడి యోర్పుమై
సైరింప స్థైర్య మొసంగినావు
పతి దయారహితుఁడై బంధింప, విడిపించి
యావ యావ్యథల వహించినావు

పండరిఁ బ్రసిద్ధిఁ జెందు పాండురంగ క్షేత్రమందు
తనువిచ్చి, యింటిక నిలిపినావు
భక్తప్రభావంబుఁ బ్రకటంబుఁ గావించి
యెల్లబంధులఁ గటాక్షించినావు

మలినచిత్తులౌ సత్తమామలకుఁ బతికి
నంచితోజ్జీవనముఁ బ్రసాదించినావు
భక్తజనసుఖాస్పద! "సక్కుబాయి" వరద!
రఖుమబాయీలోల! శ్రీ పాండురంగవిఠల!

ధనలోభియును దానధర్మవిహీను గో
టీశ్వరుఁ బేదఁ గావించినావు
పాలతి లక్ష్మిబాయి ముక్కఱ నెపమున
భక్తప్రపత్తులఁ బఱపినావు
గనికాంగనకుఁ జేతి కంకణంబిడి, నృప
శిక్షచే శాంతి హెచ్చించినావు
సపరివారుండవై చని సుత 'రుక్మిణీ
బాయి' యింటను సారెఁ బంచినావు

నారదాంశసంభవుని గన్నడమునందు
వెలగేయముల్ పాడించి యేలినావు
దాససుఖద! పురందరదాస వరద!
రఖుమబాయీలోల! శ్రీ పాండురంగవిఠల!

-: స్వవిషయము :-

కవితామృతరసంబుఁ జవిచూప 'అబ్బురాజ్
వీరరాఘవు' నిఁ జేర్పించినావు
తగు ప్రబోధంబు 'బందా ఆదినారాయ
ణుని' చేతఁ గావించి మనిచినావు
గీతామృతాది సత్కృతు లాంధ్రఫణితిఁ బ
ల్కించి వాక్శుద్ధిఁ గల్పించినావు
కోరి 'సమర్థ సద్గురు సాయిబాబా మ
హరాజ' వై యాశ్రయమిడినావు



ఇపుడు - మిత్రుఁ డీ 'వేంకటకృష్ణుఁడ' పయి
భక్తవిజయలీల స్మరింపంగఁ బనిచి
చిన్ననాటికాంక్ష ఫలింపఁజేసినావు
రఖుమబాయిలోల! శ్రీ పాండురంగవిఠల!



-: కృతిసమర్పణము :-

అనురాగంబున నీ పదాబ్జములఁ నే నర్చింపఁగాఁగోరి నే
ర్చినచందంబున నీదు భక్తసుమరాశిన్ గూర్చి నక్షత్రమా
ల నిదే యప్పనసేసితిన్ సుతు శుకాలాపంబులాలించి, పే
ర్మిని ముద్దీయఁగఁబోని తండ్రిగలఁడే?- శ్రీ పాండురంగప్రభూ!





# శ్రీ పాండురంగ అష్టోత్తరశత నామావళి

ఓమ్ శ్రీపాండురంగాయ నమః
,, పుండరీక వరదాయ ,,
,, జగన్నాథాయ ,,
,, రామచంద్రాయ ,,
,, నామదేవ వరదాయ ,,
,, కబీర్దాస వరదాయ ,,
,, జ్ఞానదేవావతారాయ ,,
,, భక్తార్తి భంజనాయ ,,
,, అనంతరూపాయ ,,
,, హృషీకేశాయ ,,
,, అజ్ఞానతిమిర భాస్కరాయ ,,
,, భక్తప్రీతాయ ,,
,, భాగవతప్రియాయ ,,
,, భక్తాభీష్టఫలప్రదాయ ,,
,, ఆపద్బాంధవాయ ,,
,, నరసింహమేధవరదాయ ,,
,, జనాదాయీ ప్రియాయ ,,
,, సంకటహరణాయ ,,
,, సర్వరూపాయ ,,
,, ముకుందాయ ,,
,, భక్తసులభాయ ,,
,, అన్యదుర్లభాయ ,,
,, ప్రణతార్తిభంజనాయ ,,
,, హరిహరరూపాయ ,,
,, హరివాసర వ్రతైక శీలప్రదాయ ,,

ఓమ్ శ్రీగీతప్రియాయ నమః
,, గీతాచార్యాయ ,,
,, తారకబ్రహ్మరూపిణే ,,
,, ఏకనాథావతారాయ ,,
,, దీనబంధవే ,,
,, భక్తవరదాయ ,,
,, ధర్మసేతవే ,,
,, ఆశ్రితవాత్సల్యజలధయే ,,
,, సర్వశరీరాయ ,,
,, గోపికారమణాయ ,,
,, అర్థితార్థపరిదానదీక్షితాయ ,,
,, ఆశ్రితకల్పద్రుమాయ ,,
,, ద్వారకాపతయే ,,
,, మధురాపతయే ,,
,, మధురాయ ,,
,, అక్రూరవరదాయ ,,
,, విచిత్రచారిత్రాయ ,,
,, నీలాచలనివాసాయ ,,
,, గోపీవల్లభాయ ,,
,, నంద నందనాయ ,,
,, దేవకీ నందనాయ ,,
,, వాసుదేవాయ ,,
,, రాధాప్రాణనాథాయ ,,
,, రుక్మి లోలాయ ,,
,, కూర్మరూపిణే ,,
,, గజేంద్రవరదాయ ,,

# శ్రీపాండురంగ అష్టోత్తరశత నామావళి

ఓమ్ శ్రీగోపాలచూడామణయే నమః
,, ఆనందాయ ,,
,, ఆనందదాయ ,,
,, శరణాగతవత్సలాయ ,,
,, భక్తజనపరతంత్రాయ ,,
,, భాగవతాపచారాసహిష్ణవే ,,
,, ఆపద్రక్షకాయ ,,
,, భవభయహరాయ ,,
,, భక్తజనవిధేయాయ ,,
,, ఆంజనేయవరదాయ ,,
,, గరుడారూఢాయ ,,
,, ప్రాణదాయ ,,
,, స్తుతిప్రియాయ ,,
,, మోక్షప్రదాయ ,,
,, సర్వసంపత్ప్రదాత్రే ,,
,, సతాంగతయే ,,
,, జ్ఞానగమ్యాయ ,,
,, విషహరాయ ,,
,, మీరాబాయీవరదాయ ,,
,, ప్రణతార్తిభంజనాయ ,,
,, శ్రీపతయే ,,
,, సర్వసమర్థాయ ,,
,, సమర్థసద్గురవే ,,
,, పరమగురవే ,,
,, జపఫలప్రదాయ ,,
,, భక్తమానసనివాసాయ ,,
,, శ్రీనివాసాయ ,,

ఓమ్ శ్రీపరాత్పరాయ నమః
.. ఆత్మారామాయ ..
.. నిర్హేతుకకటాక్షాయ ..
.. సర్వలోకశరణ్యాయ ..
.. కృపాకరాయ ..
.. భక్తానుసారిణే ..
.. పురుషోత్తమాయ ..
.. సచ్చిదానందస్వరూపిణే ..
.. లీలామానుషవిగ్రహాయ ..
.. భక్తిశక్తిప్రదాయ ..
.. శ్రీవత్సకౌస్తుభధరాయ ..
.. యశోదావత్సలాయ ..
.. గోవిందాయ ..
.. కమలలోచనాయ ..
.. కమలాపతయే ..
.. పరంజ్యోతిషే ..
.. వనమాలినే ..
.. శంఖచక్రధరాయ ..
.. తులసీదామభూషణాయ ..
.. బృందావనాంతసంచారిణే ..
.. మురారయే ..
.. నరకాంతకాయ ..
.. విశ్వరూపప్రదర్శకాయ ..
.. సత్యవాచసే ..
.. సత్యసంకల్పాయ ..
.. జగద్గురవే ..
.. తీర్థపాదాయ ..

ఓమ్ శ్రీ [illegible] నమః .. పురందరదాసవరదాయ ,,
.. వేదవేద్యాయ ,, .. దయానిధయే ,,
ఓమ్ శ్రీ రఖుమాయీ పాండురంగ విఠ్ఠలేశాయ నమః

---

# మంగళాశాసనము

మంగళం విఠ్ఠలేశాయ యోగిహృత్పద్మవాసినే
శ్రీమత్పుండరీ నాథాయ భక్తప్రీతాయ మంగళమ్.
మాతా పితృ మహాభక్త పుండరీకాయ మంగళమ్
చంద్రభాగనదీతీర వాస కృష్ణాయ మంగళమ్.
మంగళం రుక్మిణీలోల పాండురంగాయ మంగళమ్
పండరీపుర వాసాయ విఠ్ఠలేశాయ మంగళమ్.
మంగళం జ్ఞానదేవాయ, తులసీదాసాయ మంగళమ్
మంగళం తుకారామాయ ఏకనాథాయ మంగళమ్.
మంగళం మద్గురుభ్యోఽస్తు తద్గురుభ్యోఽస్తు మగంళమ్
సర్వ భక్తజనేభ్యోఽస్తు నిత్యశ్రీర్నిత్య మంగళమ్.

-: ఫలశ్రుతి :-

పుండరీకచరిత్రంబుఁ బాండురంగ
విఠల నక్షత్రమాలను ప్రీతి నాల
కించు పఠియించు వారలభీప్సితార్థ
చయముఁగాంతురు శ్రీకృష్ణ సాయికరుణ.

పుండరీకచరిత్ర, శ్రీపాండురంగ నక్షత్రమాల,
శ్రీపాండురంగ అష్టోత్తరశత నామావళి, మంగళాశాసనము
సర్వము సంపూర్ణము,
శ్రీకృష్ణార్పణమస్తు!
ఓమ్ తత్సత్.

# సవరణ

| పుట. | పంక్తి. | ముద్రితము. | సవరణ. |
|---|---|---|---|
| i | 4 | పాండురగమ్ | పాండురంగమ్ |
| | 7 | కాయాం | కాయం |
| | 9 | భవాద్ధే | భవాబ్ధే |
| ii | 13 | స్తనం | స్తవం |
| ౨ | 6 | మొది | మొంది |
| ౩ | 5 | వేంకటకృష్ణయ్యా | వేంకటశేషయ్యా |
| | 16 | వేంకటకృష్ణయ్యా | వేంకటశేషయ్యా |
| ౪ | 24 | మంత్రోపదేష్టి | మంత్రోపదేష్ట |
| ౬ | 24 | దగిన | దగని |
| 5 | 17 | సంప్రీతాత్ములకై | సంప్రీతాత్మలకై |
| 9 | 5 | తల్లిదండ్రులకు | తలిదండ్రులకు |
| 15 | 3 | నడులు | నడుగులు |
| 17 | 6 | జగమయ్యో | జగమయ్యా |
| 18 | 20 | ప్లాదుల | హ్లాదుల |
| 26 | 16 | న గించుచు | న గ్గించుచు |
| 27 | 7 | కబీరు | కబీర్ |
| 36 | 9 | గిరధరలాలు | గిరిధరలాల్ |
| 38 | 11 | భక్తవిజయలీల | భక్తవిజయలీలల |

ఈ రచయితచే రచియింపఁబడిన గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 | శ్రీ దేవకీనందన శతకము | 1923 |
| 2 | శ్రీ లక్ష్మీనృసింహ (కరావలంబన) స్తోత్రము (శ్లోకములు-పద్యములు) | 1924 |
| 3 | శ్రీ భావనారాయణస్వామి స్థల మాహాత్మ్యము (బాపట్ల) | 1924 |
| 4 | శ్రీ శివరాత్రి మాహాత్మ్యము | 1925 |
| 5 | శ్రీ ముకుందమాల (తెనుగుపద్యములు) | 1926 |
| 6 | శ్రీమద్భగవద్గీతామృతము (భగవద్గీతాశ్లోకములు-తెనుగుపద్యములు) | 1929 |
| 7 | ఆశ్చర్యచూడామణి (శక్తిభద్రకృత సంస్కృత నాటకమున కాంధ్రానువాదము) | 1934 |
| 8 | ప్రబోధసుధాకరము, శ్రీ శంకర భగవత్పాద రచిత ప్రకరణగ్రంథము (శ్లోకములు-తెనుగుపద్యములు) | 1936 |

(1-8 పునర్ముద్రణము కాఁదగినవి)

## శ్రీ సాయిలీలా ప్రచురణములు

| | | | |
|---|---|---|---|
| 9 | శ్రీ సాయిబాబాపూజాస్తవములు, మొదటికూర్పు | 1957 | |
| | ,, రెండవకూర్పు | 1962 | 1-00 |
| 10 | శ్రీకృష్ణకర్ణామృతము (శ్రీ లీలాశుకసంస్కృతకృతికి తెనుగుపద్యములు) | 1958 | 1-00 |
| 11 | శ్రీ సాయిమననము 3 సర్గములు | 1958 | 1-00 |
| 12 | శ్రీ ఆపదుద్ధారకశతకము మొదటికూర్పు | 1959 | |
| | రెండవకూర్పు | 1962 | 0-50 |

13 శ్రీ వేంకటేశ్వర సుప్రభాత గీతములు

,, మొదటికూర్పు 1960

,, రెండవకూర్పు 1962

14 శ్రీ సాయీకరుణ (4 తరంగములు) 1960

15 శ్రీ సాయిబాబాకూడదేవుడేనా? 1960

ఉన్నదేవుళ్ళుచాలకనా? (సందేహనివృత్తి)

16 శ్రీ పుండరీకచరిత్రము & 1964

పాండురంగనక్షత్రమాల

## ముద్రణము కావలసినవి

17 శ్రీ లక్ష్మీనారాయణ స్తోత్ర మంజరి

18 శ్రీ హనుమాన్ చాలీసా–దండకము

19 శ్రీ సాయీ కబీరుసూక్తులు (సాఖీలు–ద్విపదలు)

20 ప్రేమామృతము–నారద భక్తిసూత్రములు

(టీక–సూత్రపద్యము - వివరణగీతమాలిక)

21 ఏమి నిన్నుపేక్షింతునా?

(శ్రీ సాయీబాబా పూర్ణచరిత్రము - భక్తుల అనుభవములు)

22 శ్రీ సాయీవిజయము (జంగమకథ)

